# భారతీయ
# కార్మికోద్యమ చరిత్ర

# విషయసూచిక.

# భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

## (1)

## 1918-1926

మనదేశంలో కార్మికోద్యమం 1918 లో ప్రారంభమయిందని చెప్పవచ్చు. కాని, దీనికి ముందే 1905,1906 సంవత్సరాలలో కొన్ని కార్మిక సంఘాలున్నాయి. అవి కలకత్తా ప్రెస్ వర్కర్సు యూనియన్, బొంబాయి పోస్టల్ వర్కర్సు యూనియన్లు. ఇవిగాక ఇతరసంఘాలు మరేవీ దేశంలో లేవు. కాని, సేవ-పరోపకారం అనుకొని, కార్మికస్థితిని సంస్కరిద్దామనుకొని, కొందరు వ్యక్తిగతంగా కార్మిక సేవ చేస్తుండేవారు. అది 1881వ సంవత్సరం. అప్పుడు అసంతృప్తికరమైన క్లాజులు పొట్టనిండా పెట్టుకొని మొదటి ఫ్యాక్టరీచట్టం అమలులోకి రాబోతుంది. అయితే దానిని మిస్టర్. ఎస్. ఎస్. బంగాలీ, మిస్టర్. నారాయణరావు లోఖండేగార్లు ఎదుర్కొన్నారు.తీవ్రంగా నిరశించారు. 1911వ సంవత్సరంలో, కూలీల మేలుగోరే ఒక సంఘం స్థాపించబడింది. కార్మికుల చట్టాలకు సంబంధించిన అర్జీలను, చాలాసార్లు, ప్రభుత్వానికి పంపిందా సంఘం. ప్రభుత్వం

బొంబాయి సోషల్ సర్వీస్ లీగ్ నుండి కార్మికుల విషయమై, సల హాలు తీసుకొనుచుండేది. అయినా ఈపనులకీ, కార్మికోద్య మానికీ ఎట్టి ప్రత్యక్ష సంబంధం లేదు.

'కార్మిక ఉద్యమం' అంకురార్పణమయింది 1918వ సంవత్సరంలో. ఆసంవత్సరం మొత్తంమీద అన్ని వృత్తులలోనూ, కార్మికసంఘాలు స్థాపింపబడినాయి. మద్రాసు లేబర్ యూని యన్, కలకత్తా డాక్ వర్కర్సు యూనియన్, జి. ఐ. పి. రైల్వే యూనియన్, యం. యస్. యం. ఆర్. మెన్స్ యూనియన్, బొంబే సీమన్స్ యూనియన్, అహమ్మదాబాదు లేబర్ ఎసోసి యేషన్, కాన్పూర్ లేబర్ యూనియన్; బి. ఎన్. డబ్ల్యు. మెన్స్ ఎసోసియేషన్, మొదలైన సంఘాలు, మూలమూలలా దేశంనిండా స్థాపింపబడినాయి.

ఈ కొద్దికాలంలో కార్మికోద్యమం ఇలా ఎందుకు విజృంభించిందని ప్రశ్న?

మహాయుద్ధం (Great war) జరిగిపోయింది. తినుబం డారాల ధర హెచ్చింది. జీవితం గడిపికొనటానికి ఆవశ్యకమయిన బట్టలు మొదలైనవి ప్రియమైనాయి. కాని కార్మికుల జీతాలో అంతే. వృద్ధిలేదు. పైగా శ్రమ, రాత్రి రెండురెట్లు, పగలు రెండురెట్లు చేయాలసివచ్చింది. యూరప్, యుద్ధంలో మున్గి

పోయింది. యుద్ధసామాగ్రి చేసుకోవటంలోనే సరిపోయింది యూరప్ దేశానికి. అదే మంచితరుణం. హిందూదేశ ధనాఢ్యులు మార్కెట్‌పై ఏకాధిపత్యం (Monopoly) వహించారు. ఒక్క హిందూదేశంలోనే గాదు.ఇతర దేశాల్లోకూడా వారి సామాగ్రి ఎగుమతి కాసాగింది. విశేషించి బట్టలమిల్లులలో లాభాలు వచ్చినయి. పెట్టుబడిదారులకు, వందలు, వేలు, లక్షలు లాభాలు! కార్మికులకో ప్రతివస్తువూ గిరాకి!! కార్మికులు డస్సిపోయారు. స్వార్థాంధులగు పెట్టుబడిదారులు, కార్మికుల కష్టాల్ని గమనిస్తారా? కార్మికులలో అసంతృప్తి హెచ్చింది.నిరాశ హెచ్చింది. యజమానులపై ద్వేషం బలిసింది.ఫలితం? దేశమంతటా సమ్మెలే! ఈ సమ్మెలకాలంలో సంఘటనావశ్యకత గుర్తించారు కార్మికులు. దేశమంతా కార్మిక సంఘాలు స్థాపించారు.

ప్రారంభంలో, కార్మికోద్యమ విస్తారానికి, ఉన్నతికీ, మరొక కారణం ఉంది. ఈ రోజులలోనే జనీవా అంతర్జాతీయ కార్మిక సంఘం స్థాపింపబడింది. దాని నియమాల ననుసరించి, కార్మికులకొక అధికారంగల్గింది. ఆ అధికారం, హిందూదేశపు ప్రతినిధులను పంపడానికి గవర్నమెంటుకు సిఫారస్ చేయడం. "కేవలం కార్మికసంఘాల సంఖ్య వృద్ధిచేయడంకాదు. అన్నింటినీ ఒకసూత్రంతో బంధించాలి. ఒక కేంద్రీయ సంఘటనం (Central organization) ఏర్పరచాలి. అందుచేత అంతర్జాతీయ సంఘానికి, హిందూదేశప్రతినిధులను, కార్మికులంతా ఒకటై

ఎన్నుకోగలరు." అన్న భావం ఇపుడు నిశ్చితమైంది. అందుకని బొంబాయిలో మొదటి ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ 1920లో జరిగింది. దీనికధ్యక్షుడు లాలా లజపతిరాయ్. యూనియన్ స్థాపనతో కార్మికోద్యమానికి విశేష బలం చిక్కింది. లేనిచోట్లగూడా కార్మికసంఘాలు స్థాపించ బడినాయి

1918 నుండి 28 వరకు కార్మిక నాయకత్వం సంస్కారవాదుల (Reformists) చేతుల్లోఉంది. వీరికి కౌన్సిళ్ళు, కమీషన్లు, అంతర్జాతీయ కార్మికసమ్మేళనాలంటే మోజు. కార్మిక శక్తిపైనో, అవిశ్వాసం. అధైర్యం. కార్మికుల నుద్ధరించాలంటే పైవి అన్నీ ఆవశ్యకం అంటారు ఈ సంస్కారవాదులు. ఈ దృష్టికోణా (Point of view) ఫలితం? మొదట కార్మికవర్గం ఉత్సాహం, వీరత్వం చూపించింది. తుదకు సఫలతాపూర్వంగా యుద్ధాన్ని సాగించలేక పోయింది. ఎలాగైనా సమ్మెలు వ్యాపించకుండా, మిల్లుయజమానులతో సంధిచేసుకొని ఉండాలని వీరి అభిప్రాయం. అందుకనే సమ్మెలకాటంకం కల్గించేవాళ్లు. ఎక్కడన్నా సమ్మెలు సాగించితే అవి తమ నాయకత్వం స్థాపించుకోవడానికి. ఈ చిత్తవృత్తే కార్మికుల నణగద్రొక్కింది. 1922వ సంవత్సరం తర్వాత యజమానులు అధికారం చెలాయించడం అధికమయింది. కార్మికులు నీచంగా చూడ బడవలసి వచ్చింది. మహాయుద్ధకాలంలో, పెట్టుబడిదారులు ఇష్టం వచ్చినట్లు లాభాలుతీశారు. పరిశ్రమలను వృద్ధిచేశారు. కాని అది ఎన్నోరోజులు

సాగలా. యుద్ధం అయిపోయింది. మళ్లా వ్యాపారానికి నడుము కట్టారు యూరపు పెట్టుబడిదార్లు. ఫ్యాక్టరీలలో పాత మెషిన్‌లు తీసి పారవేశారు. క్రొత్తవి- చురుకుగా పనిచేశేవి మెషిన్లు పెట్ట బడినాయి. రెండు సంవత్సరాలు జరిగింది. యూరప్ మార్కెట్ నిండా బట్టలు, వివిధసామాగ్రి నిండిపోయింది. అమ్ముడు పోవాలి ఇక! మార్కెట్ కోసరం వెదికారు. ఉన్నదిగా అన్నిటికిని హిందూదేశం. హిందూదేశానికి ఇతరదేశాల దిగుమతి హెచ్చు అయింది. ఇక హిందూ దేశపు పెట్టుబడిదార్లు దోచుకోడానికి వీలులేదు. పోటీ హెచ్చయింది. నిల్వలేకపోయారు. లాభాలు తక్కువయినాయి. వ్యాపారం మందమయింది. చేసేపనేముంది. మొదట కార్మికులపై గొడ్డలిపెట్టు పెట్టారు. కూలి తగ్గించారు. సంస్కారవాదుల అధికారం గల రోజులవి. ఆసమయం లోనే సంఘటనం లో బలహీనత, నాయకత్వపు కొరత కన్పించినాయి.

1923 సంవత్సరంలోనూ, తర్వాత జరిగిన సమ్మెలు, కేవలం యజమానుల అన్యాయాలని ఎదుర్కొనేందుకు మాత్రం జరిగి నయి. అన్నిటికంటె పెద్దసమ్మె అహమ్మదాబాద్ లో జరిగింది. ఆరోజు 1924 ఏప్రియల్ 1. 100 కి 20 చొప్పున కూలి తగ్గిం చామని యజమానుల ప్రకటన. ఒక్కసారి - దీనికి విరుద్ధంగా 56 బట్టల మిల్లుల లోని 43000 మందికార్మికులు, స్ట్రైక్— కార్మికులు ధైర్యంగా నిల్చారు. కాని నాయకుల బలహీనత

వాళ్లని లొంగదీసింది. యజమానుల ముందర తలలు వాల్చారు. అహమ్మదాబాదు కార్మిక సంఘనాయకులగు మహాత్మాగాంధి, వల్లభ భాయి పటేల్, అనసూయా బెన్ (ఒకయజమాని సోదరి) గారలు 100కి 15 చొప్పున కార్మికుల జీతాలు తగ్గించాలని ఒప్పించారు. ఇది మహాత్మునికి కార్మికులపైగల అవ్యాజ ప్రేమ!

1924వ సంవత్సరంలో మరోసమ్మె. బొంబాయి టెక్స్టైల్ కార్మికులు సమ్మెచేశారు. మిల్లు యజమానుల సంఘం, కార్మికులకు 'బోనస్' (సంవత్సరాంతర లాభపంపకం) ఈయనన్నారు. వెనుక ఐదేళ్లనుండి వస్తున్నదీ బోనస్. ఈ నాడు కాదన్నారు. అది తమ జీవితంలో ఒకభాగమని తలచారు కార్మికులు. వట్టిదయింది. ఇక, ఆ ఆశాభంగం, 1924 జనవరి 17 తేదీన సమ్మెచేయించింది. సమ్మెచేసినవారు ఒకరా, ఇద్దరా? 1,60,000 మంది. ప్రభుత్వంకూడా, ఒకవిచారణ కమిటీ నియమించింది. సంఘటనం బలహీనమయినా, కార్మికులు దృఢసాహసాలతో పోట్లాడారు. మార్చి 15వ తేదీవరకు సమ్మెసాగింది. కాని చివరకు ఓడిపోయారు. ఒకసంవత్సరం జరిగింది. రెండో సమ్మె. ఇదివరకు మనం జయించామన్నఅహంకారం మిల్లు యజమానులకి. 100కి $11\frac{1}{2}$ చొప్పున జీతాలకోత. వెంటనే సమ్మె. ఈ సమ్మెలో సంస్కారవాదులుగాని, ఆ యూనియన్‌గాని సాయం చేయలేదు. అయినా ధైర్యంగా ఎదుర్కొన్నారు కార్మికులు. ఈసారి క్రిందటిసారి జయించామన

అహంకారంగల యజమానులే ఓడిపోయారు. లొంగిపోయారు. తమ ప్రకటనను ఉపసంహరించుకొన్నారు. ఇదే కాలంలో అహమ్మదాబాదు బట్టలమిల్లులలో సమ్మెలు జరిగాయి. 100కి 20 చొప్పున జీతం తగ్గించితే సమ్మె మొదలు. కార్మికుల కిష్టం లేకుండానే ఈవిషయం పంచాయతీ స్వాధీన మయింది. కలక్టరు స్వయంగా తీర్పరై కూర్చున్నాడు. దీనికి ఫలితంగా 100కి 15 చొప్పున తగ్గింపుకు కార్మికులు ఒప్పుకొన్నారు. ఈ కార్మిక సమ్మెను సాగించటంలో, ముందుకు తీసుకు వెళ్లడంలో శివరావ్ ఆదిగాగల సంస్కారవాదుల చేతులలో ఉన్న కార్మిక సంఘం భాగం తీసుకోలేదు.

మొదట చెప్పినట్లుగా, సంస్కారవాదుల ప్రభుత్వం ఆరోజుల్లో. ట్రేడ్ యూనియన్ కూడా వాళ్ల చేతులలోనే పడింది. యజమానుల అక్రమచర్యలకు విరుద్ధంగా పోరాడేందుకు కార్మికులను రెచ్చగొట్టాలి ట్రేడ్ యూనియన్. కాని వారు ట్రేడ్ యూనియన్‌ను వ్యక్తిగత అధికారం, నాయకత్వం, కోసం ఉపయోగించుకొన్నారు. అంతర్జాతీయ కాంగ్రెస్ ప్రతినిధులను పంపడంవరకే కాని, కార్మికోద్యమాభివృద్ధికి కార్యక్రమం ఏమీ లేదు. సమ్మెలెన్నో జరిగాయి. లాభం సున్న. కార్మికులు సమ్మె చేశారంటే తమ శక్తితో చేశారు. ఈనాయకులు తమ నాయకత్వం స్థిరంగా ఉండాలని సహాయం చేశారు. 1924లో

## భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

సి. ఆర్. దాస్ గారి ఆధిపత్యంతో కలకత్తా లో ట్రేడ్ యూని యన్ కాంగ్రెస్ సమావేశం జరిగింది.

మిల్లు యజమానుల ఘోరాలు మితిమీరినయి. కార్మికుల ఓళ్ళు అంతరించింది. అయినా ట్రేడ్‌యూనియన్ భారత దేశ కార్మికులకు త్రోవ చూపించని రోజులవి. మద్రాస్‌లో ట్రేడ్‌యూనియన్ సమావేశం జరిగింది. దానికి వి. వి. గిరి గారు అధిపతి. వెనుకటి సమావేశాలకీ దీనికీ ఏమీ భేదం లేదు. 1927 మార్చిలో మళ్లా సమావేశం. అప్పుడు ఢిల్లీలో రాయ్ సాహబ్ చంద్రికా ప్రసాద్‌గారి ఆధిపత్యం. దీనికి 57 మంది ప్రతినిధులు వచ్చారు. ఈ సమావేశంలో, ప్రధాన కార్యదర్శి జోషీ తన రిపోర్టు చదువుతూ,— "సమ్మెలు జరప మని చెప్పటానికి ట్రేడ్‌యూనియన్‌కు ఆవశ్యకతకల్గలేదు." అని అన్నాడు. ఎవరైనా, వినేవాళ్లు— కార్మికులకు కష్టాలు లేవు కాబోలు— అని అనుకొంటారు. కాని అది అబద్ధం. కార్మికుల కష్టాలు దినదినం వృద్ధిపొందుతూనే ఉన్నాయి. దారిద్ర్యం ప్రబలుతూనే ఉంది. అయినా ట్రేడ్‌యూనియన్ నాయకులు— సంస్కారవాదులు— మౌనందాల్చారు. ప్రతిసంవత్సరం లాగానే జనీవా ప్రతినిధులను ఎన్నుకొని తమ తమ యిండ్లకు పోయారు.

---

# భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

## (2)

### విప్లవాంకురణము.



కార్మికోద్యమ చరిత్రలో 1927 నుండి ఒక క్రొత్త అధ్యాయం ప్రారంభ మయింది. ఈ సంవత్సరం అన్నివిధాల అభివృద్ధిలో ఉంది. 1923 నుండి 1926 వఱకు కార్మికోద్యమంలో క్షీణదశ కల్గింది. కాని 1927 లో ఆశిథిలత, క్షీణదశ తగ్గిపోయింది. 1918-20 సంవత్సరాల లోని ఆ ఆవేశం మళ్ళా 1928 లో చూపించ బడింది. అన్నిటికంటె రైల్వే యిలాకా లో కార్మికఉద్యమ ప్రభావం కన్పించింది. కార్మికులకు జీతాలకోతలు ఎక్కువయినయి. ఎన్నో రైల్వే లైనులలో చాలా తగ్గింపులు ప్రవేశపెట్టారు. దీనికి విరుద్ధంగా కార్మికులెన్నో సమ్మెలు జరిపారు. బొంబాయి బట్టల మిల్లులలో పెద్దాచిన్న కలపి 60 సమ్మెలు జరిగాయి. ఈ సమయములో కార్మికులకు 1918-20 సంవత్సరాలకంటె మెక్కువ వర్గచేతనం ( Class conciousness ) కల్గింది. వెనుకటి కార్మిక కలహాలలో సంస్కార వాదనాయకులు ఉదాసీనత చూపించారు. అదే కార్మికుల కండ్లను విప్పింది. వారిలో విప్లవాంకురాలు రేకెత్తినాయి. ప్రారంభంలో, జీతా

ల హెచ్చింపుకు సంస్కారవాదులు ప్రయత్నించారని, విశ్వాసం ఉండేది. కాని మెన్నాళ్ళు కళ్ళుమూయడం. 1923 నుండి 26 వరకు జరిగిన అనుభవం సంస్కారవాదులమీద విశ్వాసం తగ్గిపోయింది.

కార్మికవర్గపు దృక్పథంమారి, సంస్కారవాదుల నుండి విప్లవవాదులలోకి రావడం అంటే పెద్దగాథ ! దానిని గురించి రెండు మాటలు......

1924 లో కమ్యూనిష్టు కుట్రకేసులో కొందరు శిక్షపొందారు. వారు 1927 లో విడుదల అయారు. అపుడే కార్మికోద్యమంలో తీవ్రకార్యం సాగించడానికి ఒక గ్రూప్ తయారయింది. వారు విప్లవవాదులు. వారు ముఖ్యంగా బొంబాయి, బెంగాల్ ప్రాంతాల్లో కార్మికోద్యమము ప్రారంభించారు. 1927 డిశంబరులో ఆల్ యిండియా ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ కాన్పూరులో సమావేశమయింది. దానిలో చాలామంది విప్లవవాదులు హాజరయ్యారు. కాని మెజారిటీ వీరిదిగాదు. అయినా కొద్దిగా వీళ్ళ ప్రభావం పడకపోలా—

ఇంకోవిధంగా చూచినా కాన్పూరు సమావేశం లాభకరమయిందే. ఈ వత్సరమే కార్మికులలో రాజకీయజాగృతి ప్రారంభ మయింది. దీనికి ముందు కార్మికోద్యమానికి ఆధా

ఆర్థికం. దాని లక్ష్యం, సంస్కారవాద నీతిద్వారా, జీతాలు హెచ్చు చేయించు కోటానికి పనిచేయు కాలం తగ్గించుకోటానికి ఆందోళన చేయటం మాత్రమే. ఆకాలపు నాయకులు, ఆర్థికదుస్థితి బాగుచేసుకుంటూ, రాజకీయానికి దూరంగా ఉండాలని నిశ్చయించుకొన్నారు. కాని కాన్పూరులో రాజకీయాలలో కూడా భాగం తీసుకోవాలని తీర్మానించారు. ఆ సంవత్సరమే బ్రిటిష్ ప్రభుత్వం సైమన్ కమీషన్ పంపించింది. దేశంలో మూలమూలలా దాన్ని బహిష్కరించారు. ట్రేడ్ యూనియను కాంగ్రెసులో కూడ దాన్ని బహిష్కరించాలని తీర్మానం నెగ్గింది. కమీషనుకు విరుద్ధంగా ప్రదర్శనాలు జరపాలని కార్మికులకు నివేదనలు పంపబడినయి.

విప్లవవాదప్రభావానికి, కార్మికవర్గ దృక్పధం మారిందనేందుకూ, ఒకగుర్తు చీనా విషయమైన తీర్మానమే. చీనాలో స్వాతంత్ర్యం కోసం పోరాటం జరుగుతుంది. వారు సామ్రాజ్యవాద శక్తులన్నిటిని ప్రతిఘటిస్తున్నారు. అలాంటి సమయములో భారతదేశ ప్రభుత్వం ఆ విప్లవం అణచడానికి సైన్యం పంపింది. ఇది ఘోరమని నిందిస్తూ ఒక తీర్మానం ప్యాస్ చేశారు.

ఇంక ఒకటిరెండు తీర్మానాలు......................

"సామ్రాజ్య వాదమంటే ధనాఢ్యుల శాసనస్వరూపం" తెల్లవాళ్ళయినా, నల్లవాళ్ళయినా, ప్రపంచకార్మికవర్గాన్ని ధనాఢ్యుల

స్వార్థం కోసరం బానిసపు సంకెళ్ళలో బిగించడం సామ్రాజ్య వాదం యొక్క తత్వం. వర్గకలహపు ఆధారంతో (On the basis of class struggle ) ప్రపంచకార్మికులంతా ఏకమయి సామ్రాజ్య వాదానికి విరోధంగా పోటీచేయడానికి తయారు గావాలని" అన్నది ట్రేడ్ యూనియన్.

ఈ సమావేశానికి బ్రిటిష్ ట్రేడ్ యూనియను కాంగ్రెసు నుండి మిస్టర్ పర్సల్ మిస్టర్ హాల్స్వర్త్ అను యిద్దరు ప్రతినిధులు వచ్చారు. ట్రేడ్ యూనియను కాంగ్రెసును ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్సుతో సంబంధం కలుగజేయాలనివారు భారతదేశానికి దిగారు. ఈ ఫెడరేషన్ లో బ్రిటిష్ ట్రేడ్ యూనియను కూడా కలిసివుంది. ఈ ఫెడరేషను సంస్కారవాదుల చేతులలో ఉంది. "ఇది కార్మికవర్గానికి శత్రువు. ప్రపంచసామ్రాజ్యవాద శక్తులను స్థిరపరచాలని దీని వుద్దేశ్యం." అని దాని చరిత్రచేత ఋజువగుతుంది. ట్రేడుయూనియన్ను ఫెడరేషనుతో కలపండి అన్న సూచనవచ్చింది. సరేనంటే సరేనన్నారు జోషీ మొదలైన సంస్కారవాదులు. కాని ఈ సమావేశంలో విప్లవ వ్యతిరేక వాదులకు ( Counter revolutionaries) కు అధికసంఖ్య లేదు. కాబట్టి ఈ సూచనకు ప్రాముఖ్యత ఈయబడలా. కాని ఢిల్లీలో కార్యనిర్వాహక వర్గం మళ్ళా మూడు నెలలకు సమావేశ మయింది. మళ్ళా ఈ విషయం చర్చకువచ్చింది. మిస్టర్ పర్సలు హాల్సువర్త్ గార్లు

ఇంకా యిక్కడే ఉన్నారు. వారు ఈ సభకు కూడా హాజరయ్యారు. అన్నివిధాల శ్రేమ యూనియనును కలపాలని ప్రయత్నించారు. కాని విఫలమయింది. గతిలేక సంస్కారవాదులు దానిని మరు సంవత్సరానికి వాయిదా వేశారు.

ఈ సమయములో ఫిబ్రవరి 3వ తేదీన సైమను కమీషను బొంబాయిలో దిగింది. కార్మికులంతా కమీషనును తిరస్కరిస్తూ ఒక పెద్ద ఊరేగింపు జరిపారు. దానికి భారతదేశమంతా ఆశ్చర్య పడింది. విప్లవవాదుల కృషి ఫలితంగా నల్లజెండాల వూరేగింపు జరిగింది. బొంబాయి బట్టల మిల్లుల కార్మికులు, రైల్వేవర్కుషాపు కూలీలు, పనిమాని ఊరేగింపులో చేరారు.

కార్మికుల ఈ ప్రదర్శనం, వృద్ధిచెందుచున్న ఈజాగృతి, మున్ముందు రానున్న విప్లవవాద కార్మికోద్యమానికి చిహ్నలనవచ్చు.

---

# భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

## (3)

## 1928-29

సంస్కారవాదుల భంగము.



1928 లో బొంబాయిలో పెద్దసమ్మె జరిగింది. ఈ సమ్మెలో లక్షన్నరమంది కార్మికులు పాల్గొన్నారు. ఈ సమ్మె మిల్లు యజమానుల అన్యాయాలను ఎదుర్కొనాలని ఉద్దేశ్యంతో లేవదీయ బడింది. ఇది ఆరునెలలు సాగింది.

ఈ సమ్మెను గురించి తెలిసికొనే ముందు హిందూదేశ ఆర్థిక మాంద్యమును గురించి తెలిసి కోవాలి. మహాయుద్ధం ముగిశాక అన్నిదేశాలవాళ్లు తమ వ్యాపారం సాగించ మొదలు పెట్టారు. ఇదివరలో యుద్ధంలో మునిగియుండటం వల్ల వాళ్లకి వ్యాపారం చేసుకునేందుకు తీరిక లేదు. ఈ వ్యాపారంలో ధనాఢ్యుల మధ్య పోటీ హెచ్చయింది. అందుచే చౌకగా వస్తువులను తయారు చేస్తేగాని లాభాలు రావు. అమ్ముకునేందుకు మార్కెటు లేదు. ఖర్చుతగ్గించి, కొద్ది పెట్టుబడితో, తక్కువఖరీదుకు, ఎక్కువ సామగ్రి తయారు చేయాలని వాళ్లు సంకల్పిం

చారు.అందుకని తక్కువ కార్మికులతో,ఎక్కువ సామగ్రి తయారు చేయటానికి సహాయపడే మెషీన్లు కనిపెట్టి ఉపయోగించసాగారు.దీనివలన అనేకమంది కార్మికులు నిరుద్యోగు లయ్యారు జీతాలు తగ్గించారు పైగా.యూరపులో వ్యాపారం సాగగానే హిందూదేశానికి బట్టలు, ఇనుము మొదలైనవి దిగుమతి కాజొచ్చినవి. విదేశిబట్టలు చౌక అవడంవల్ల హిందూదేశ వ్యాపారస్థులకు లాభాలు సన్నగిలినయి. అంచేత వాళ్ళు తమఖర్చులు తగ్గించుకోవాలి. ఖర్చు తగ్గించడానికి ఉపాయమేమిటి? వాళ్ళ కళ్ళు కార్మికులపై బడ్డాయి. కార్మికుల జీతాలకు ఎసరు పెట్టారు. ఇదే రేషనలిజేషన్ (Rationalisation) రక్షణతో కార్మికుల ఆదాయం తగ్గించారు. ఇది, రైల్వేలో, బట్టల మిల్లులలో, బెంగాల్ జనుప మిల్లులలో, జెమ్‌షెడ్‌పూర్ తాతా కంపెనీలో ప్రయోగించారు. అంతటితో 1928 లో సమ్మెల వరుస ప్రారంభ మయింది. సమస్త హిందూదేశ కార్మికులు, ఎప్పుడైనాసరే పెట్టుబడి దారులకు విరుద్ధంగా పోరాడాలి అన్న మాటకు దృష్టాంతరం 1928 లో కన్పడింది.

బొంబాయి మిల్లులలో రేషనలిజేషన్ పెట్టారు. మిల్లు యజమానులు కార్మికులచే ఎక్కువపని చేయించుకో దలచుకొన్నారు. అందుచే, ఒకప్రక్క దారం తీసేవాళ్ళు,రెండుప్రక్కలను, రెండు మగ్గాలపై పని జేసేవాళ్ళు మూడు మగ్గాల పైననూ,పని చేయాలన్నారు.ఈస్కీము ప్రకారం పనిజేసినా కార్మి

కులకు జీతం మామూలే. ఈ స్కీము అమలులో పెడితే చాలా మంది కార్మికులు నిరుద్యోగు లవుతున్నారు. యజమానులు ఇదే సమయమని, వెనుక సమ్మెలలో పాల్గొన్న ముఖ్యనాయ కులను తీసివేయసాగారు. ముందు సాసూన్ మిల్లులలో ఈ పద్ధతి ప్రారంభమయింది. ఒకేసారి ఈపద్ధతి అమలు సాగించితే జనరల్ స్ట్రైక్ ( సార్వజనిక సమ్మె ) జరుగుతుందని భయం. అందుకని సాసూన్ మిల్లుల నుండి మొదట ప్రారంభించారు. ఆ మిల్లు కార్మికులు సమ్మెకట్టారు. తర్వాత వాడియా మిల్లు లలోగూడ దీన్ని ప్రయోగించారు. అక్కడక్కడా సమ్మెలు ప్రారంభ మయినయి. కాని చాలాకాలం నిలవలా. యజమా నుల షరతులకు లోబడి కార్మికులు పనికి వెళ్ళారు. ఇది మిల్లు యజమానులకు ఉత్సాహం కల్గించింది. అన్ని మిల్లుల లోను, ఏదోరూపంతో, రేషనలిజేషన్ ప్రయోగించారు.

బొంబాయి మిల్లుల యజమానులంతా ఒకటై, కార్మి కుల జీతాలను తెగ నరుకుతుంటే బొంబాయి టెక్స్టైల్ లేబర్ అసోసియేషన్, దాని నాయకులగు జోషీ, బఖలే ఆదిగా గల సంస్కారవాద నాయకులు మౌనంగా కూర్చున్నారు. వీరు కార్మికులకు, సంఘటనం ద్వారా పోరాడమని చెప్పలేదుగాని, మొదటనుండి సమ్మె వద్దని, ఉపన్యాసాలు, కరపత్రాలు పంచి పెట్టారు. కాని విప్లవ వాదులగు నాయకులుమాత్రం నిర్మాగ

మాటంగా, మిల్లు యజమానుల నిరంకుశ చర్యల నుండి రక్షిం చ బడాలంటే సార్వజనికమగు సమ్మె చేసి తీరాలని తేట తెల్లంగా చెప్పారు. రేషనలిజేషన్ అమలు పెట్టేదాక, కార్మికులకు చీమ కుట్టలేదు. కాని, అమలులోనికి వచ్చి, తమ జీతాలు తీసుకొన్నప్పుడు వారి స్థితి తెలిసి కొన్నారు.

కరీంభాయి గ్రూప్ ఏప్రియల్ 16 వ తారీఖున సమ్మె ప్రారంభించారు. దాని తర్వాత దినదినం, సమ్మెల సంఖ్య హెచ్చయింది. ఏప్రియల్ 23 వ తేదీన పరశురామజాధవ్ అనేవాడు పోలీసువాళ్ళ గుళ్ళకు ఎఱ అయ్యాడు. అతను మరణించాడు. ఈ ఘటన కార్మికులను ఉత్తేజితుల గావించింది. అతని వీరత్వం కార్మికులలో జీవం పోసింది. మూడు దినాలలో బొంబాయి లోని అన్ని మిల్లులు మూసివేశారు. సమ్మె చేసిన వారి సంఖ్య లక్షన్నర అయింది. వెంటనే అన్ని మిల్లుల కార్మిక ప్రతినిధులు, విప్లవవాదులు గలసిన ఒక కమిటీ తయారయింది. ఈ సమ్మెలో గొప్ప ఊరేగింపులు మూడు బయలు దేరినయి. ప్రతిపర్యాయం, పోలీసులు, ఉత్సవాల్ని, భగ్నం చేయాలని ప్రయత్నించారు.

సమ్మె ప్రారంభం లో, ఎం. ఎన్. జోషీ, యొక్క సంస్కార వాద సంఘం సెంట్రల్ లేబర్ యూనియను వారు సమ్మె వలదని గొప్ప ఆందోళన చేశారు. ఎన్నో కరపత్రాలు

పంచి పెట్టారు. కాని లాభం లేక పోయింది. రోజురోజూ సమ్మె శక్తివంత మయింది. ఏప్రియల్ 29వ తేదీన సమ్మెదారులు తమ కోర్కెలను ఒక పట్టికగా తయారు చేశారు. ఈ కోర్కెల ద్వారానే ముందలి పోరాటం సాగింది. రెండు వారాలలో పోరాటం తీవ్ర మయింది. జోషీ, అతని దళనాయకులు ఎన్ని ప్రయత్నాలు చేసినా సమ్మె ఆగదని తెలిసి కొన్నారు. ఇలాంటి సమయం లో వారికి రెండే మార్గాలు. సమ్మె నుండి విడి పోవడం. లేకపోతే సమ్మెకు సహాయం చేయడం. సమ్మెకు సహాయం చేయడమే, అప్పటి పరిస్థితులలో మంచిపని అని తలచారు. సమ్మెల లో పాల్గొని, కార్మికుల విశ్వాసం చూరగొని, వీలయితే, కార్మికుల సమ్మెను ఆపు చేయడమో, లేకపోతే, విప్లవ వాదుల చేతులలో పడకుండ చేయటమో, ఏది వీలైతే అది చేయాలని వీరి ఉద్దేశ్యం. ఇక విప్లవ వాదులు గూడ, తమ సమ్మె జయం పొందాలంటే, జోషీ, బఖలే ఆదిగా గల నాయకుల ప్రభావములో పడిఉన్న కార్మికులను గూడా కలుపు కోవాలని తలచారు. అంచేత ముప్పది మంది గల జాయింటు సమ్మె కమిటీ ఒకటి నిర్మించారు. దీనిలో జోషీ పార్టీ 15 గురు ఉన్నారు. ఈ కమిటీ అంతా గలసి, 17 షరుతులు గల ఒక నివేదనా పత్రం తయారు జేశారు.

ఈ సమ్మె కాలం లోనే, బొంబాయి బట్టల మిల్లు కార్మిక సంఘ మొకటి రిజిష్ట రయింది. దీని పేరు గిర్నీ కాంగా

ర్ యూనియన్. ఇది 1928 మే 23వ తేదీన రిజస్టరయింది. ఇది కార్మికులలో ఎఱ్ఱ జెండా సంఘం (రెడ్‌ఫ్లాగ్ యూనియన్) అని పేరు పొందింది.

మే 12 వ తేదీన మిల్లు యజమానులు కార్మికుల కోర్కెలకు జవాబు ప్రకటించారు. 17 వ తేదీన మరియొక ప్రకటన ప్రకటించారు. ఈ ప్రకటన లో, తమ మిల్లు లను క్రింద షరతుల ప్రకారం నడిపించుతా మన్నారు. ఆ షరతులు ఇవి.

(1) బొంబాయి మిల్లు లన్నింటి లోను, ఒకే స్కేలు పైని జీతం ఈయ బడుతుంది.

(2) ప్రతి కార్మికుడూ పూర్తిగా పది గంటలు పని చేయాలి. ఇది వరకు తక్కువ గంటలు పని చేస్తూన్నా, ఇకనుండి, పూర్వపు జీతం తోనే ప్రతి కార్మికుడూ పది గంటలు పని చేయాలి.

(3) అన్ని మిల్లుల లోను, ఒకే విధమగు, నియమాలు చట్టాలు, నిర్మింప బడతాయి.

(4) కార్మికుల లెక్కలు జూడటం లో ఒకే విధమగు పద్ధతి అవలంబింప బడుతుంది.

(5) జరిమానాల వలన వచ్చే ఫండు కార్మికుల సంస్కారపు ఫండులో వేయ బడతుంది. మిగిలిన జీతాలు కార్మికులు కోరినపుడు ఈయ బడును.

ఈ ప్రకటనతో, మిల్లు యజమానుల అభిప్రాయం తెలసి పోయింది. జీతాలు తగ్గించి, బొంబాయి మిల్లు లన్నింటి లోను, రేషనలిజేషన్ ప్రయోగించా లని వారి ఎత్తు.

ఈ ప్రకటన తో కార్మికుల లో ఆవేశం అధిక మయింది. ఈ సమయం లో తలకాయ ఒగ్గడం అంటే, మిల్లు యజమానుల అన్ని విధాల అత్యాచారాలను సహించడమే అని వారు తెలిసి కొన్నారు. మిల్లు యజమానులు, సమ్మెలను చెడగొట్ట దలచిన పెద్దలు, ఎన్నో రహస్య యత్నాలు చేశారు. ఇట్టి ప్రయత్నం, జోషి పార్టీ కూడ చేసింది ఆగస్టులో. వారు, కార్మికుల సభలో, "మన సమ్మె కీయబడు చున్న ఆర్థిక సహాయం, అయి పో వచ్చింది" అని చెప్పారు. కాని కార్మికులు, "మేమిూ సహాయాల కోసరం సమ్మె చేయడం లేద"ని జవాబిచ్చారు. కార్మికు లాకలి తో చస్తూ గూడా సమ్మె చేశారు.

ప్రారంభం లో, మిల్లు యజమానులకు," తాము జాయింటు సమ్మె కమిటీ తో మాట్లాడం" అనే దురంహాకారం ఉండేది. కాని చివఱకు, అక్టోబర్ నాల్గవ తేదీన జాయింటు

సమ్మె కమిటీ, మిల్లు యజమానుల ప్రతినిధులు గలిసిన ఒక కాన్ఫరెన్సు జరిగింది. దానిలో క్రింది షరతుల ప్రకారం కార్మికులు సమ్మె ఆపు చేయాలని తీర్మానింప బడింది.

(1) కార్మికుల 17 కోర్కెల (Demands)ను, మిల్లు యజమానుల స్కీములను, విచారించ డానికి, బొంబాయి గవర్నమెంటు నుండి ముగ్గురు మెంబర్లు గల ఒక కమిటి నిశ్చయింప బడాలి.

(2) సమ్మె చేసిన మొదటి దినము నుండి, ప్రభుత్వపు రిపోర్టు వెలువడే టంత వరకు (నవీన పద్ధతి ఇదివరకే ప్రారంభింప బడిన మిల్లుల లో తప్ప తక్కిన చోట్ల) పూర్వపు రేట్ల ప్రకారమే జీతం యిస్తారు.

1928 వ సంవత్సరపు సమ్మెలో బొంబాయి కార్మికులు ఎట్టి జయమునూ పొంద లేదు. కాని ఈ సమ్మెతో కార్మిక వర్గానికి సాహసం, ఆత్మ విశ్వాసం, వర్గ చైతన్యం (Class Consciousness) వెనుకటికంటె ఎన్నో రెట్లు వృద్ధి అయింది. కార్మికులు, ఇలాంటి పరిస్థితుల లో, ఏ వ్యవహారం కూడా, సంస్కార పద్ధతిని నడుపుట అపాయ కరమని తెలుసు కొన్నారు. తమ అధికారం రావాలంటే, వర్గ కలహం (Class struggle) మీద ఆధారపడి, శక్తి గల్గి యుద్ధానికి తయారయే కార్మిక

సంఘాలు స్థాపించుకోవాలని తెలుసుకొన్నారు. ఈ సమ్మెతో బొంబాయి లో సంస్కార వాదుల పలుకుబడి నశించి ట్రేడ్ లేబర్ యూనియన్ నామ మాత్ర మయింది. కార్మిక యుద్ధం లోనే పుట్టి, కార్మికులకు సేవ జేస్తున్న గిర్ని కాంగార్ యూనియన్, క్రమ క్రమంగా శక్తి వంత మయింది. బొంబాయి లో దానికి ఎనిమిది కేంద్రాలు స్థాపించ బడినయి. 1928 లో దాదాపు 65 వేలమంది మెంబర్లు వున్నారు.

బొంబాయి సమ్మె గాలి దేశమంతా వీచింది. ఈసమ్మె దేశంలో కార్మికులను మేల్కొల్పింది. బొంబాయి కార్మికుల సాహసం, వీరత్వం, ఇతర కార్మికుల కాదర్శ ప్రాయ మయింది. ఒక నెల జరిగాక, షోలాపూర్ లో ఒక సమ్మె జరిగింది. దాని లో 13 వేలమంది కార్మికులు పాల్గొన్నారు. ఈ రోజులలోనే మద్రాసు బట్టల మిల్లుల లో సమ్మె జరిగినది. కాని సరియగు నాయకత్వము లేకను, కొందరు మిల్లు యజమానుల పక్షం చూపడం చేతను, సమ్మె అపజయము పొందినది. ఢక్కా మిల్లులలో గూడ సమ్మె చేయ బడెను.

కార్మికులు కదల కుండా, మెదల కుండా ఉన్న కేంద్ర మేదయ్యా, అంటే, అది అహమ్మదాబాదు. ఇచ్చటి కార్మిక సంఘము మహాత్ముడు స్థాపించాడు. సంస్కార వాదులగు జోషీ గారి సంఘం కంటె అధమ స్థితిలో ఉంది ఈ సంఘం

దీనికి కారణం ఇచట కార్మిక నాయకులు, మహాత్మాగాంధి, వల్లభ బాయ్ పటేలు మొదలైన వారు. వీరి దృష్టిలో, కార్మికులకు యజమానులకు గల వర్గ కలహం (Class struggle) లేదు. యజమానులు దయదలచి, హృదయ పరివర్తనము జరిగి కార్మికులు 'ధర్మకర్తలై' సరియగు జీతాలు ఇస్తారని నమ్మకం. అందుచేతనే ఈ సంఘం ఇంత వెనుక బడి వుంది. దేశం లో వ్యాపించి ఉన్న కార్మి కోద్యమము నుండి అహమ్మదా బాదు కార్మికులను తప్పించా లని అచ్చటి నాయకుల అభిప్రాయము. కాని 1928 లో బొంబాయి లో సమ్మె జరిగి నపుడు అహమ్మదాబాదు లో కూడ అలజడి కల్గింది. కాని నాయకులు వారి ఆవేశాన్ని అణచి వేశారు. బొంబాయి సమ్మెకు సహాయం కోసరం, ఒక ప్రతినిధి అహమ్మదాబాదు వచ్చాడు. అతడు సమ్మెలో పాల్గొన్నాడని చెప్పి, అచటికార్మిక నాయకులు, సహాయం చేయ రాదని కార్మికులకు బోధించారు. అయినా, తమ జీతాల నుండి, వేలకొలది రూపాయలను కార్మికులు ప్రోగుచేసిరించారు. కాని నాయకుల ప్రతిబంధకం వల్ల క్రియా రూపక మగు సహాయం మాత్రం చేయలేదు. ధనసహాయం మాత్రం చేశారు. 1922 లోను, తర్వాతనూ, గాంధీ గారికి, దేశంలో పలుకుబడి యెంత వ్యాపించినా కార్మికుల లో మాత్రం ఏమీ లేదు. వారు గాంధీ గారి పద్ధతుల వలన తమకు గల్గే లాభం ఏమీ లేదని నిశ్చయించు కొన్నారు.

1928 అక్టోబరు సంధి ఎక్కువ రోజులు నిలవ లేదు. పని ప్రారంభించి, తమ తమ పనులకు పోగానే, మిల్లు యజమానులు, సమ్మెలో ముఖ్య భాగం తీసుకొన్న వారిని, ఏరి ఏరి తీసివేయ సాగారు. గిర్నీ కాంగార్ యూనియన్ కార్యనిర్వాహక సభ్యుల్ని, వారి తరపున మిల్లులో మెంబర్లను చేర్చు వారిని, తొలగించ మొదలు పెట్టారు. ప్రభుత్వం కూడ పంచాయతిని కూడ నియమించింది. మిల్లు యజమానుల అన్యాయాలు పంచాయతి ముందు చూపింప బడినవి. అయినా దాని వలన లాభం లేక పోయింది. అన్యాయాలు సాగుతునే ఉన్నాయి. 1929 ఏప్రియల్ లో వాడియా మిల్లు యజమానులు, గిర్నీ కాంగార్ యూనియన్ కార్య నిర్వాహక సభ్యుల్ని చాలా మందిని వెళ్ళ గొట్టారు. వారు గిర్నీ కాంగార్ యూనియన్ శక్తి తెలుసుకోలేదు. దీనికి వ్యతిరేకంగా 6 వేల మంది కార్మికులు సమ్మె చేశారు. మిల్లు యజమానుల అన్యాయాలకు జవాబు, సమ్మె కంటె వేరే ఏమీ లేదు. ఏప్రియల్ 26 వ తేదీన సమ్మె ప్రారంభ మయింది. ఈ సమ్మె అణగ గొట్టటానికి విప్లవ వ్యతిరేక వాద శక్తులు (Reactionery elements) అన్నీ పోగయినయ్. ప్రభుత్వం, మిలటరీ సహాయం చేసింది. సభలు నిషేధించ బడినాయ్. కర్ఫ్యూ ఆర్డరు సాగింది. గిర్నీకాంగార్ స్వయం సేవకులను కొట్టేటందుకు కాడీలను నియోగించారు యజమానులు. సంస్కారవాదులు బహిరంగంగా,

యజమానులతో గలసి సమ్మెలను అణగగొట్ట దలిచారు. ఈ క్లిష్టసమయం లో వారు కార్మికులను అనుకరించ లేదు. వారు కూడా సమ్మె వలదని ప్రచారం చేయడానికి స్వయం సేవకులను నిర్మించారు.

ఈ అన్ని విరోధ వర్గాలతో చాలా కాలం పోటీచేయడం కార్మికులకు కష్టమయింది. కార్మికు లెన్నుకొన్న నాయకులను జైళ్ళలో వేసింది ప్రభుత్వం. వారు ప్రభుత్వాలన్ని కూల దన్నటానికి యత్నించా రని కేసు నడిపారు. ఇదేమీరాటు కుట్ర కేసు. 1929 వ సమ్మె ఓడిపోయింది.

ఈ రెండు సంవత్సరాలలో ఇంకా కొన్ని ప్రదేశాలలో సమ్మెలు జరిగినయ్. కలకత్తాలో జనపనార పనివాండ్లు సమ్మె చేశారు. సమ్మెకు కారణం, జీతములు హెచ్చించాలని, కార్మికుల యూనియనును, యజమానులంగీకరింప వలెనని. ఇ. ఐ. ఆర్, రైల్వే పనివాండ్రు కూడా పైకారణముల కొరకే పని చేశారు. యస్. ఇ. ఆర్, రైల్వేలో కూడ సమ్మె చేసిరి. ఈ సమ్మె దారుణమైన హత్యాగాథల తో ముగిసింది. ఇందు లోని కార్మికులు 1 సం॥ నుండి 14 సంవత్సరముల వరకు శిక్షింపబడిరి. ఈ సమ్మెల లో పూర్తిగా జయము లభింపలేదు. కాని కొంతవరకు కార్మికుల కోర్కెలు అంగీకరించ బడినయ్.

---

# భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

## (4)

### ప్రభుత్వవైఖరి - మీరటు కుట్రకేసు.

దిన దినమూ పెరుగుచున్న కార్మికోద్యమం లో ప్రభుత్వం తీసుకున్న భాగమేమి ? ఈ అధ్యాయం లో ప్రభుత్వ వైఖరిని గురించి విచారించుదాం.

1928 లోని సమ్మెలు, కార్మికులను ముందుకు తీసుకొని వెళ్ళినయి. కార్మిక ఉద్యమం మంచి వ్యాప్తికి వచ్చింది. 1918 లో మిల్లు యజమానులకు బాగా లాభాలు ఉండేవి. అప్పుడు ఒక రోజు సమ్మె చేసినా ఎంతో నష్టం. అందుకని ఎక్కువ పోట్లాట లేకుండానే కార్మికుల కోర్కెలు త్వరగా చెల్లింపబడు చుండెడివి. ఆ రోజులలో సంస్కారవాదులే నాయకులు. ఈ చిన్న చిన్న జయముల వలన సంస్కారవాదులపైన కార్మికులకు విశ్వాసం గల్గింది. కాని తర్వాత తర్వాత, యజమానులు చేసిన దుండగాలు, ప్రభుత్వవైఖరి, సంస్కారవాదుల నిజరూపము బయటపడ్డాక, కార్మికులు కండ్లు తెరిచారు. 1928 లోని సమ్మెలు వారిలో వర్గ కలహ ( Class

struggle) భావం వ్యాపింప జేసింది. ప్రభుత్వం ధనాఢ్యులను, పెట్టుబడి దారులను, యజమానులను సమర్థించు తుందని తెలుసు కొన్నారు. కార్మికులు, తాము, పెట్టుబడి దారుల తో కూటికేగాక, ప్రభుత్వముతోను,యజమానుల తోను, స్వాతంత్ర్యము కొఱకు గూడా పోట్లాడు తున్నా మని తెలుసుకొన్నారు. కార్మికులలో గల్గిన ఈ మనఃపరివర్తనను ప్రభుత్వం కూడా గుర్తించింది. దీని వలన తనకు ఆపద ఉన్నదని ప్రభుత్వం గుర్తించింది. కార్మికోద్యమం అణగగొట్టకపోతే తప్ప, దేశంలో ఒక గొప్ప విప్లవం- అణచటానికి అశక్య మయినది—బయలు దేరుతుందని తలచింది. అందుకని అణచ ప్రారంభించింది.

సమ్మెలలో ముఖ్య భాగముల తీసుకొన్న వారి నందరిని అరస్టు చేసింది ప్రభుత్వం. 1929 మార్చి 20 వ తేదీన వారి నందరిని మీరటుకు తీసుకు వెళ్ళారు.అరస్టు చేయబడిన వారిలో 'గిర్ని కాంగార్ యూనియన్'కార్యనిర్వాహక వర్గమంతా ఉంది. ఇంకా జి.ఐ.పి. రైల్వే కార్మిక సంఘ నాయకులు, బెంగాల్ జనపనార పనివాండ్ర నాయకులు, అనేక కార్మిక కర్షక సంఘ నాయకులు ఇందులో వున్నారు. వీరిపై"చక్రవర్తి గారి ప్రభుత్వమును కూలద్రోయుటకు కుట్ర చేసిరి" అను నేరము మోపబడినది. దీనినే మీరటు కుట్ర కేసు అంటారు. ఈ కేసు దేశంలో చాలా అలజడి గొల్పింది. ఈ కేసును గూర్చి ప్రకటింపబడ్డ పత్రికలను జనులు విపరీతముగా చదువ సాగారు. ఈ కేసు

విచారణ నాల్గు సంవత్సరాలు జరిగింది. ఇందులో నిందితులు 32 మంది ఉన్నారు. వారిలో ముగ్గురు ఆంగ్లేయులు. వారు "హచ్చిన్సన్, బ్రాడ్లే, స్ప్రాట్" అనువారు. హచ్చిన్సన్ యువకుడు. పత్రికావిలేఖరి. వీరందరి పైనా 121 ఎ. సెక్షన్ (క్రి.ప్రొ. కో.) నేరం మోపారు. వీరిని మీరటులో విచారించడానికి కారణం లేకపోలేదు. బొంబాయిలోగాని, కలకత్తాలోగాని, విచారిస్తే హైకోర్టు జడ్జీలు జ్యూరీ సలహా తీసుకోవాలి. మీరటులో అయితే జిల్లాజడ్జీలే విచారిస్తారు. ముద్దాయీలకు జామీన్ ఇవ్వడానికి నిరాకరించారు. కాని 1931 లో మాత్రం కమ్యూనిష్టులు కాని వారిని కొద్దిమందిని మాత్రం, జామీన్ పై విడుదల చేశారు.

ఈ కేసులో బొంబాయి మిల్లు సమ్మె సందర్భమున ఈయబడిన 700 ఉపన్యాసాలు పోలీసు రిపోర్టర్లు చదివారు. పబ్లిక్ ప్రాసిక్యూటర్, ముద్దాయీ లందరూ, ఇ.ఐ.ఆర్, జి.ఐ.పి, బి. బి. సి. ఐ, యస్. బి. రైల్వే సంఘములను గిర్ని కాంగార్ యూనియన్‌ను, బెంగాల్ జనపనార పనివాండ్ర సంఘమును, కూలివాండ్ల సంఘము, పాకీవారిసంఘము, మొదలైన కార్మిక సంఘా లన్నిటినినో, వశపరచుకొనిరని, తెలియ జేశారు. ముద్దాయిలలో ఒకరుగూడ న్యాయవిరుద్ధమగు కార్యము చేసిరని రుజువు కాలేదు. నేరము ప్రభుత్వాన్ని పడద్రోయుట, అనియేగాని, ఒకరుగూడ, ఒక హత్యగాని, దోపిడిగాని, చేసిరని

గాడు. 1928 లో లేబర్ గవర్నమెంటు వచ్చింది బ్రిటన్‌లో. కాని ఇది ఇండియా గవర్నమెంటుకే సహాయం చేసింది. కార్మిక నాయకుల విచారణ సందర్భమున ఖైదీలజామీను, హైకోర్టులలో విచారింపబడు హక్కు, మొదలయినవాటిలో, కార్మికనాయకులకు ఏమీ సహాయం చేయలేదు. ఈ మీరటు కుట్రకేసు నాల్గు సంవత్సరాలకు పైగా విచారింప బడింది.

(1) మేజస్ట్రేటు ఎదుట మొట్టమొదట విచారణ 7 మాసాలు.

(2) సెషన్సు కోర్టులోని ప్రాసిక్యూషన్ సాక్ష్యము 13 మాసాలు.

(3) ముద్దాయీల స్టేటుమెంటులు 19 మాసాలు.

(4) డిఫెన్సు సాక్షుల విచారణ 2 మాసములు.

(5) వాద ప్రతివాదములు $4\frac{1}{2}$ మాసములు.

(6) సెషన్సు జడ్జియొక్క తీర్పు 5 మాసములు.

(7) హైకోర్టులో అప్పీలు - తీర్పు 6 మాసములు.

1931 అక్టోబరునాటికి, ఈ కేసుకు 1,26,000 పౌన్లు ప్రభుత్వానికి ఖర్చు అయింది. ప్రాసిక్యూషన్ పక్షంవారు 3,500, డాక్యుమెంట్లను కోర్టులో ఫైలుచేశారు. 320 మంది ప్రాసిక్యూషన్ సాక్షులు విచారింపబడ్డారు. జడ్జీగారి తీర్పు 676 పేజీలుగల రెండు పెద్ద పుస్తకా లయినది. 1933 జనవరి 15 న

తేసిన క్రింది కోర్టువారు తీర్పు చెప్పారు. ఈక్రిందివిధంగా ముద్దాయీలకు శిక్ష విధింప బడింది.

(1) ముజఫర్ అహమ్మద్ గారికి యావజ్జీవ ద్వీపాంతర వాస శిక్ష.

(2) డాంగే, ఘాటే, జోగ్లేకర్, నింబకర్, స్ప్రాట్ గార్లకు, 12 సంవత్సరముల ద్వీపాంతర వాస శిక్ష.

(3) బ్రాడ్లే, మిరాజకర్, ఉస్మాని గార్లకు 10 సంవత్సరముల ద్వీపాంతర వాస శిక్ష.

(4) ముగ్గురు భారతీయులకు, 7 సంవత్సరముల ద్వీపాంతర వాస శిక్ష.

(5) మరి నలుగ్వురి భారతీయులకు, 5 సంవత్సరముల ద్వీపాంతర వాస శిక్ష.

(6) పదకొండుగురికి, 3 సంవత్సరములు మొదలు నాల్గు సంవత్సరముల వరకు కఠినశిక్ష.

(7) ముగ్గురి పై కేసు కొట్టివేయ బడింది. ఒకరిని మొట్ట మొదటి విచారణ పూర్తి కాగానే విడిచి పెట్టారు.

ఈ తీవ్రమైన కఠిన శిక్షలకు బ్రిటిషు కార్మిక వర్గం కూడా అసంతృప్తి చెందింది. దేశ మంతటా బహిరంగ సభలు,

ఊరేగింపులూ, చెలరేగినయి. మీరటు కేసు అప్పీలుకుగాను, ఇంగ్లండు లోని కార్మిక సంఘాలు 1,094 పౌన్లు వసూలు చేసి పంపారు. 1933 ఆగస్టు 3 వతేదీన హైకోర్టు జడ్జీలు తీర్పు చెప్పారు. 9 మందిపై కేసు కొట్టి వేయబడింది. డాంగే, ముజఫర్ అహమ్మదు, ఉస్మానీగార్లకు 3 సంవత్సరాలూ, ఘాటే, జోగ్లేకర్, నింబకర్, బ్రాడ్లే, మిరాజకర్, జోషీ, మజీద్ గోస్వామి గార్లకు ఒక సంవత్సరమూ, చక్రవర్తిగారికి 7 మాసములూ, కఠిన శిక్ష విధించారు. కమ్యూనిష్టు పార్టీ సభ్యులుగా ఉన్న వారికి హెచ్చు శిక్షలు విధించారు. ఒకరు జైలులో చనిపోయారు.

ఈ కేసుతో, ప్రభుత్వ వైఖరి బయట పడింది. మున్ముందు జరుగ బోయే పోరాటాలు కేవలం పెట్టుబడి దారులతోనే గాక, పెట్టుబడి దారుల ఏజంటగు ప్రభుత్వంతో కూడా జరుపవలసి వస్తుందని కార్మికవర్గం తెలుసుకొంది.

ఈ కాలం లో కార్మికోద్యమం అణగ గొట్టటానికి ప్రభుత్వం రెండు క్రొత్తచట్టాలను అమలు పఱచింది. ఒకటి పబ్లిక్ సేఫ్టీ ఆర్డినెన్సు. దీనిచేత విదేశీయు డెవడైనా, దేశంలో శాంతికి భంగకరం గా కన్పించినా, ప్రభుత్వానికి అపాయ కారకుడైనా, అతన్ని దేశం నుండి వెళ్ళ గొట్ట వచ్చు. ఇది నిజంగా, భారతదేశం లో కమ్యూనిస్టు ప్రచారం చేయడానికి

వచ్చే విదేశీయులును అరికట్టడానికి అమలులోకి వచ్చింది. ఇది 1929 వ ఏప్రిల్ లో ప్రవేశ పెట్ట బడింది. ఇక రెండవది ట్రేడ్ డిస్ప్యూట్ ఆక్టు. ఇది పైకి వర్తక కలహమును తీర్చే దాని లాగ కన్పడుతుంది. కాని దీని వలన రైల్వే, టెలిగ్రాఫ్, పోస్టల్, ట్రాం మొదలయిన సర్వ జనులకు హితకరమైన పరిశ్రమలలో 15 రోజుల నోటీసు లేకుండ సమ్మె చేయరాదు. ఇంకా సానుభూతి సమ్మెలు, ప్రభుత్వమును లొంగదీయుటకు చేయు సమ్మెలు అక్రమములని ప్రకటింప బడినయి.

ఈ రెండుచట్టాల వలన దేశం లో కార్మి కోద్యమపు తీవ్రత కొంచెం తగ్గింది. కార్మిక నాయకులు, బొంబాయి, కలకత్తా, మొదలగు ప్రదేశాలలో ఉపన్యసించి నందులకు శిక్షింపబడ్డారు. ఈవిధంగా చట్టాలను ప్యాస్ చేసి, నాయకులను శిక్షించియు, కార్మికుల వర్గ చైతన్యాన్ని (Class consciousness) నాశనం జేయ దలచారు. కాని దేశంలోని అసంతోషాగ్నిని కూడా ప్రభుత్వం గుర్తించింది. 1928 లో ఫాసెట్ కమిటీ (Fawcett Committee) ని నియమించింది. మరల 1929 జనవరి లో విటలే (Whitely) అను నాయకత్వం క్రింద ఒక విచారణ సంఘం నియమించింది. దీనినే విటలే కమీషన్ అంటారు. ఈ కమిటీ వారి లెక్కల ప్రకారం 1929 సంవత్సరం చివరకు 87 కూలీ సంఘాలు రిజష్టరు చేయబడినయి. వాటిలో 1,83,000 మంది సభ్యులున్నారు.

ఒక వైపున, ఆర్డినెన్సులు, చట్టాలతో కార్మికుల శిక్షిస్తూ, మరొక ప్రక్క కమిటీల నియమించు తున్న ప్రభుత్వ నైఖరిని అర్థం చేసుకొన్నారు కార్మికులు. విటలే కమీషన్‌ను తిరస్కరించారు. బహిష్కరించారు. కమీషన్ తో సహాయో గం ((Cooparation) చేసింది, జోషీ మొదలగు సంస్కార వాదులు. వీరిని కార్మిక కమీషన్ మెంబర్లగ, సహాయులుగ, ప్రభుత్వం ఎన్ను కొంది. ఈ విటలే కమీషనుగూడా నాగపూరు ట్రేడ్ యూనియన్‌లోని చీలికలకు కారణ మయింది.

# భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

## (5)

### నాగపూర్ కాంగ్రెస్ - ట్రేడ్ యూనియన్ లో చీలికలు.

ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కాన్పూరులో సమావేశ మయినప్పుడు విప్లవవాదుల శక్తినిగూర్చి ఇదివఱకే చెప్పాను. 1928 వ సంవత్సరపు బొంబాయి సమ్మెతో విప్లవవాద కార్మికోద్యమం ముందుకు సాగింది. సంస్కారవాదులు సన్నగిలారు. 1928 డిశంబరు లో ఝరియాలో ట్రేడ్ యూనియన్ జరిగింది.(ఝరియా బెంగాల్ లో ఒక బొగ్గుగనులు గల పట్టణము. ఇచట రెండవ ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ 1921 నవంబరు 30 నుండి డిశంబరు 2 వరకు జరిగినది.) ఈ సమావేశం లో గిర్ని కాంగార్ యూనియన్ మొదలైనవి పాల్గొన లేదు. కాని కాన్పూరు సమావేశం కంటె ఎంతో ఉత్సాహ కరంగా ఉంది. విప్లవ వాదుల శక్తికూడ హెచ్చింది.

సామ్రాజ్య ప్రతికూల సమితి (League against Imperialism) ని ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ తో కలప వలెనని ఇచటనే ప్యాసయింది.

ఈ సమావేశంలోనే, జినివా ప్రతినిధులను పంపించు విషయం కూడా చర్చకు వచ్చింది. జీనివా లో, ప్రతి సంవత్సరం ఒక అంతర్జాతీయ కార్మిక సమావేశం జరుగుతుంది. కాని ఈ అంతర్జాతీయ కార్మిక ఫెడరేషన్ మితవాద వైఖరి గలది. ఇందులోని ప్రతినిధులు ప్రభుత్వములచే ఎన్నుకొన బడినవారు. ఈ ఫెడరేషన్ సామ్రాజ్య వాదమునకు ఒక అంగము. ఇది బొల్లిబొల్లి కబుర్లతో కార్మికుల కన్నీళ్ళు తుడువ ప్రయత్నించునదేగాని, కార్మికుల సంపూర్ణ హక్కులను ఈయ సమకట్టదు. ప్రభుత్వం, ట్రేడ్ యూనియన్ వద్దన్నప్పటికి ప్రతినిధులను ఈ సంవత్సరం పంపింది.

ఇక రెండవ విషయం, కొన్ని కార్మిక సంఘాలు, పై మూడవ అంతర్జాతీయ కార్మిక ఫెడరేషన్ తో, ట్రేడ్ యూనియనును కలపాలని తీర్మానించినయి. (ఈ ఫెడరేషన్ ప్రతినిధులు గత సంవత్సరం కాన్పూరునకు ఇద్దరువచ్చారు. ఈసంవత్సరం వారినుండి ఉత్తరం వచ్చింది.) జోషీ మొదలగు వారు కలపాలని యత్నించారు. కాని వారి కనుకూలంగా వాతావరణం లేదు. అందుచే తాత్కాలికంగా ఆవిషయం వదలివేయ బడింది.

* * *

# నాగపూరు కాంగ్రెస్.

1929 డిశంబరు లో ఆల్ యిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ పదవసమావేశం నాగపూరు లో జరిగింది. ఈ సమావేశానికి సభాపతి పండిత జవహరిలాల్. ఈ సమావేశమునకు 51 కార్మిక సంఘముల ప్రతినిధులు హాజరయ్యారు. ఈ సంఘములలో సభ్యులయిన వారి సంఖ్య 1,90,436. వీరిలో 50 వేలమంది మెంబర్ల ప్రాతినిధ్యం వహించిన గిర్నీకాంగార్ ప్రతినిధులు కూడా వచ్చారు. ఇంకా కొంతమంది జి. ఐ. పి. రైల్వే యూనియన్ ప్రతినిధులు కూడా అధికంగానే వచ్చారు.

ఈ సమావేశం లోనే మొట్టమొదట మితవాదులకు (సంస్కారవాదులు) అతివాదులకు (విప్లవవాదులు.) సంఘర్షణ జరిగినది. ఈ సమావేశం లో, విటలే కమీషన్ బహిష్కారం, జనీవా కార్మికకాన్ఫరెన్సు, రౌండ్ టేబిల్, సామ్రాజ్య ప్రతికూలసమతి (Anti Imperialist League) తో సంబంధం, మొదలగు విషయములు చర్చకు వచ్చినయి. తీవ్రవాదులు, బ్రిటిషు ప్రభుత్వంచే నియమింపబడ్డ విటలే (Whitely) కమీషనును బహిష్కరించాలని, రౌండుటేబిల్ కాన్ఫరెన్సు స్వాగతాన్ని తిరస్కరించాలని, జనీవా కార్మిక కాన్ఫరెన్సు లో పాల్గొనగూడదనీ తెలిపారు. దీనికి కారణం, పై వాటిలో పాల్గొన

డం సంస్కారవాద నీతి అని తలచారు. అట్లు పాల్గొనడం, ధనాఢ్య వాదం తో సహకారం చేయడం అని, వర్గ యుద్ధ (Classwar) సిద్ధాంతాలను ఎగతాళి చేయడమనీ తలచారు. ఇంతేగాక భారతదేశ కార్మికోద్యమాన్ని, ప్రపంచ మంతా వ్యాపించిన కార్మికోద్యమం లో ఒకభాగం చేయాలనుకొన్నారు. దానికొాక మొట్టు ట్రేడ్ యూనియన్‌ను సామ్రాజ్య ప్రతికూల సమితి (Anti Imperialist League)తో కలపడం.

ఇక సంస్కారవాదులు దీనికి పూర్తిగా వ్యతిరేకంగా వున్నారు. జనీవా వెళ్ళడం, రౌండ్ టేబిల్ లో పాల్గొనటం, అవశ్యమని వీరి తలంపు. విటలే కమిటీని బహిష్కరించ రాదని వీరి ఉద్దేశ్యం. కార్మికోద్యమం, చట్టయుతమైన సంస్కారవాద మార్గాన్ని విడిచి విప్లవవాదుల తెన్నుకు పోవడం వీరికి ఇష్టం లేదు.

ఇరు పక్షాల వారి సంఘర్షణానికి ఇవే కారణాలు. ఒక ప్రక్క ఎం.యన్.జోషీ, బఖలే, చమన్‌లాల్, శివరావ్ ఆదిగా గల మితవాదులు. ఇంకో ప్రక్క కమ్యూనిష్టులు, కమ్యూనిష్టు అభిప్రాయాలను అంగీకరించువారు, నేషనల్ కాంగ్రెస్‌లో నుండియు, కార్మికోద్యమ మందు అప్పుడప్పుడు పాల్గొనుచున్న అతివాదులు (Leftists in National Congress) కలరు. దీనిలో తీవ్రవాదులకే జయం కల్గింది. మితవాదులు ఓడిపోయారు. ప్యాస

యిన తీర్మానాలన్ని, ప్రతి కార్మిక సంఘం, దాని, సభ్యులు ఒప్పం కు తీరాలని కూడా ఒక తీర్మానం ప్యాసయింది.

మఱచి పోయారు. ఇంకో తీర్మానం కూడా ప్యాస యింది. అది స్వదేశీ పెట్టుబడిదారుల రాజకీయ పక్షమగు నేష నల్ కాంగ్రెస్ నెహ్రూ రిపోర్టున కనుమతించి కార్మికులకు నష్ట ము గల్గించి నందులకు అసమ్మతి చూపారు.తండ్రిగారిది రిపోర్టు. కొడుకు గారిది అధ్యక్షత. అయినా నిర్మొగమాటంగా, ఖండిం చారు. ఇది ఆత్మ విశ్వాసం గల కార్మికులు చేసినపని.

ఇక ట్రేడ్ యూనియన్ నుండి జోషీపార్టీ చీలి పోయింది. తమ సంఘాలను కూడా విడదీశారు. ట్రేడ్ యూనియన్ ఫెడ రేషను అను నామంతో మరొక సంఘం స్థాపించారు. ఈ ఫెడ రేషనులో కమ్యూనిష్టు అభిప్రాయాలు గలవాళ్ళను చేర్చు కోరు. ఫెడరేషను, విటలే కమీషన్ తో సహకారం చేసింది. రౌండ్ టేబిల్ లో పాల్గొన్నది. జనీవా కాన్ఫరెన్సుకు ప్రతినిధు లను సిఫారస్ చేసింది.

ఈ సమావేశంతో, ఆల్ యిండియా ట్రేడ్ యూని యను కాంగ్రెస్, ఆల్ యిండియా ట్రేడ్ యూనియన్ ఫెడరే షన్ అని రెండుభాగా లయినవి.

---

# భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

## (6)

## 1930 - 1932

### కలకత్తా సమావేశము.

కలకత్తా ట్రేడ్ యూనియన్ చీలికలు తెలిసికొనే ముందు, దేశం లోని కొన్ని ఘటనల గూర్చి విచారించాలి. ఈఘ టనలకూ కార్మికోద్యమానికీ చాలా సంబంధం వుంది. కాబట్టి ఇచట క్లుప్తంగా చెప్పవలసి వచ్చింది.

1929 డిశంబరులో లాహోరులో ఇండియన్ నేష నల్ కాంగ్రెస్ సమావేశం జరిగింది. దీనిలో సత్యాగ్రహ ఉద్య మం మరల మొదలుపెట్టాలని నిశ్చయింప బడింది. సంపూర్ణ స్వాతంత్ర్యం లక్ష్యం. గాంధి గారిది నాయకత్వం. లాహోరు కాంగ్రెస్ మరల సత్యాగ్రహం చేయాలంది. ఈ సమయం లో భారతదేశ కార్మిక వర్గము ఏంచేయా లన్నది ప్రశ్న. సత్యా గ్రహ ఉద్యమం సంపూర్ణ స్వాతంత్ర్యాని కని ఉద్దేశింప బడినా, అది సమయం వచ్చినప్పుడు సామ్రాజ్య వాదులతో సంధి చేసి

కొంటుందని కొందరి తలంపు. కారణ మేమంటే ఈ ఉద్యమం నడిపేవాళ్లు, ప్రోత్సహించేవాళ్లు, ధనికులు, మిల్లు యజమానులు. ఈ ఉద్యమం తో సంపూర్ణ స్వరాజ్యం సంపాదించాలన్నారు. కాని సంపూర్ణ స్వరాజ్యం అంటే ఏమిటి ? దీనికి పూర్తిగా బ్రిటిషు ప్రభుత్వం ఈ దేశంనుండి తొలగింపబడటం, అని చెప్పారు కొందరు కాంగ్రెస్ తీవ్రవాదులు. అయితే బ్రిటిషుప్రభుత్వం పోయి, స్వదేశీ పెట్టుబడిదారుల, జమీందారుల రాజ్యం వస్తే, అధికజన సంఖ్యాకులకు— శ్రమజీవులైన కార్మిక కర్షకులకు సౌఖ్యాలు కల్గుతవా ? 'స్వరాజ్యం' ఉన్న దేశాల్లో ఎంతమంది నిరుద్యోగులు, కార్మికులు, కర్షకులు పీడింపబడుట లేదు? కాబట్టి కార్మిక కర్షక నియంతృత్వం గల సంపూర్ణ స్వరాజ్యం కావాలని కమ్యూనిష్టుల అభిప్రాయం. ఇందుచేత సత్యాగ్రహం లో పాల్గొన్నా లాభం లేదనుకున్నారు. ఈ సత్యాగ్రహం, మధ్యతరగతిని అండజేసుకొని ప్రభుత్వాన్ని బెదరిస్తూ, తమకు కొద్ది సంస్కరణలు రాగానే ప్రభుత్వం తో సంధిచేసుకొని, ధనికులు సంతృప్తి పడుతారని కమ్యూనిష్టులు అభిప్రాయ పడ్డారు. కార్మికులను అట్లే బానిసపు సంకెళ్ళలో ఉంచుతారని తలచారు. అందుకని వీరు సత్యాగ్రహం లో పాల్గొనలేదు. వీరికి ప్రభుత్వమును ఎదుర్కొంటానికి ఇష్టమే, కాని వీరి పద్ధతి వేరు. శాంతియుతమై, అహింసాత్మకమైన సత్యాగ్రహం వలన లాభంలేదని, వీరి అభి

ప్రాయం. మొట్టమొదట, కార్మికకర్షక, నిరుద్యోగ యువకులను సంఘటనమొనర్చి, వారిచే తిరుగుబాటు కావింపవలెననియు, జమీందారులు, భూస్వాములు, విదేశీ అధికారము లేని కార్మిక కర్షకరాజ్యము స్థాపింపవలెననియూ, వీరి ఆశయము. అందుచే సత్యాగ్రహములో వీరు పాల్గొనలేదు. తమ అసమ్మతిని తెలియజేయుచూ, అచ్చటచ్చట ఆవేశపరులై, సత్యాగ్రహ మీటింగులలోగూడా అల్లరి చేసినమాట కూడా నిజమే.

ఇక మరికొందరు దీనికి వ్యతిరేకం. వారికికూడా, నేషనల్ కాంగ్రెస్ ఉద్యమలక్ష్యం ధనాఢ్యవాదాన్ని మరింత బలపరచటం, అని తెలుసు. అది స్వదేశీపెట్టుబడిదారలను ప్రోత్సహించడమని తెలుసు. అయినా దానిని విరోధించ గూడదనీ, తమ కార్యక్రమంతో, తమ వర్గనాయకత్వంక్రింద సత్యాగ్రహంలో పాల్గొనాలనీ వాళ్ళ అభిప్రాయం. ఈ ఉద్యమంలో పాల్గొని, కష్టాలసహించితే, దేశంలో పలుకుబడి గల్గుతుంది. తర్వాత పెట్టుబడిదార్లు, ఈ వుద్యమాన్ని ఆపి విశ్వాస ఘాతకులైనప్పుడు, వారి గుట్టు బయటపెట్టుచూ, అసంతృప్తులైయున్న మధ్యతరగతివారిని తమలో గల్పుకొని కార్మికవర్గ నాయకత్వంక్రింద ముందలి యుద్ధం నడపవచ్చుననీ వీరి అభిప్రాయము. వీరుకూడా తమను కమ్యూనిష్టులమని చెప్పుకొనేవారు. కాని

ఉగ్రమైనట్టియు, చలించనియు, నిజమగు కమ్యూనిష్టులు వీరిని త్రోసి రాజన్నారు.

కమ్యూనిస్టులు, సత్యాగ్రహముచే దేశములోనిఅశాంతి, విప్లవము, సరియగు మార్గముల నడువక, ప్రక్క కాల్వలగుండ ప్రవహించునని తలంచిరి.

కలహానికి కారణాలు యివే. ఈ భేదము మొదట గిర్ని కాంగాక్ యూనియనులో ప్రవేశించింది. సత్యాగ్రహ ఉద్యమంలో కార్మికులు పాల్గొనవలె నన్నది 'రాయ్' గ్రూప్. ఇచ్చట రాయ్ గ్రూప్‌ను గురించి కొంచెం చెప్పాలి. రాయ్ పూర్తినామం "మానవేంద్రనాథ రాయ్". ఇతడు పూర్వం రష్యాలో కమ్యూనిస్టుపార్టీ సభ్యుడుగా నుండెను. ఇతడు తూర్పుదేశములలో కమ్యూనిజం అభివృద్ధి చేయుటకు నియోగింపబడెను. కాని చైనాలో, కమ్యూనిస్టు విప్లవం జరిగినప్పుడు, పార్టీయొక్క రహస్యములు చెప్పి, విప్లవ నాశనమునకు కారకుడయ్యెను. తర్వాత భారతదేశ విషయమున ఇతడువ్రాసిన ప్రణాళిక, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీవారిచే అంగీకరింపబడలేదు. అయినను తన పద్ధతి మార్చుకొనక పోవుటచే పార్టీ నుండి ఎం. ఎన్. రాయ్ వెళ్ళగొట్టబడెను. (రాయ్‌పక్షంవారు, రాయ్ చైనాలో, ద్రోహము చేయలేదని, అతడు వెళ్ళగొట్టబడలేదుగాని, తానేపార్టీనుండి మానుకొనెనని చెప్పుకొందురు.

ఎట్లయిననూ ఫలితం ఒకటే. ఇప్పుడు అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలో ఇతనికి స్థలంలేదు). ఇతడు హిందూ దేశములో రాగానే అరెస్టుచేయబడి శిక్షింప బడెను. ఈతని పక్షంవారు కూడ భారతదేశంలో కొలదిమంది కలరు. వీరే, సత్యాగ్రహం లో పాల్గొనవలెనన్నారు.

చివరకు సత్యాగ్రహంతో సహకారం చేయాలని వ్యాస యింది. కమ్యూనిస్టులు, రాయిస్టులు అంతట విడిపోయారు. కమ్యూనిస్టులుగూడ "గిర్నీకాంగార్ యూనియన్" అనే పేరు తోనే మరొక సంఘం స్థాపించారు.

ఈ చీలికలు, 1931 లో కలకత్తా లో ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సమావేశ మయినప్పుడు మరింత బలపడినవి. రెండు పక్షాల వారు, ఇచట సమావేశ మయారు. గిర్నీ కాంగార్ ఎన్నిక విషయం వచ్చింది. దేశపాండే (కమ్యూనిస్టు కాంగార్ అధ్యక్షుడు) కాంగార్ యూనియన్ తమదే నన్నాడు. ట్రేడ్ యూనియన్ దీనికి ఒప్పుకో లేదు. ఈ సమావేశమునకు అధిపతి సుభాస్ చంద్ర బోస్. సుబాస్ చంద్ర బోస్ ♦సామ్రాజ్య వాదమును ప్రతి ఘటించుట లో అతివాది

---

♦ బ్రిటనుల సామ్రాజ్య వాదమని ఇక్కడ అర్థం. నిజముగా కేపటిలిజం యొక్క చివరి అంతస్తే సామ్రాజ్య వాదము. సామ్రాజ్య వాదమును ఎదుర్కొనడం అంటే కేపటిలిజం ను కూడా ఎదుర్కొనినటులే. కాని ఇచ్చట ఆ అర్థంలో వాడలేదు. [గ్రం. కర్త.]

మైనను, కార్మిక కార్య క్రమము సూచించుటలో మిత వాది. తమ పక్షమే జయ మొందుటకు సుబాస్, జి. ఐ. పి. ప్రతినిధులను రానీయ లేదు. మరియు తన అధ్యక్షో పన్యాసం లో, జినీవాకు కార్మిక ప్రతినిధుల పరిపాలన, గాంధి ఇర్విన్ సంధికి, తన సమ్మతి చూపడమూ, రౌండ్ టేబిలుకు ప్రతినిధులను పంప వలెననీ తన ఆశయము కనపరిచాడు. ఇంతటితో కమ్యూనిష్టులు అసంతృప్తులై పోయారు. సుబాస్ పై విశ్వాస రాహిత్య తీర్మానం తెచ్చారు. ఓడి పోయింది. కాని, తమ జి. ఐ. పి. ప్రతినిధుల రానీయ లేదను కారణంతో, రోష ముతో ఉన్మత్తు లయ్యారు. మరుసటి దినమున బలవంతంగా, హాలు ఆక్రమించు కొన్నారు. తమ ఇష్టం వచ్చిన తీర్మానాలు గావించారు. మూడవ దినం మళ్ళా ట్రేడ్ యూనియన్ జరిగింది. మరుసటి సంవత్సరపు ఎన్నికలు గూడా జరిగినయ్. ఇంతటితో కమ్యూనిష్టులు విడిపోయి, "రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్"ను స్థాపించారు. దీనితో కార్మిక సంస్థలు మూడు భాగము లయినవి. మొదటిది ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్. రెండవది ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్. మూడవది రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు. ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ పూర్తిగా, సంస్కార వాదులగు జోషీ, చమన్‌లాలు, గిరి, మొదలగు మితవాదుల చేతులలో నున్నది. ఇక ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, అటు కమ్యూనిస్టులు, ఇటు మితవాదులును గాక మధ్య రకముగా నుండు వారిసంస్థ. దానిలో

బోస్, నెహ్రూ, రూయ్‌కర్, హరిహరనాథశాస్త్రి మొదలైన వారు నాయకులు. మూడవది రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు. పూర్తిగా కమ్యూనిష్టుల చేతులలో నుండెను. 1932 లో రెడ్ ట్రేడ్ యూనియనుకును, ట్రేడ్ యూనియనుకును, సంధి జరుపుటకై యూనిటీ కమిటీ స్థాపింప బడెను. కాని కమిటీ ప్రయత్నాలు విఫల మయినవి.

1930-31 లో కార్మికోద్యమము తీవ్రరూపము దాల్చి నదని చెప్పవచ్చు. జి. ఐ. పి. రైల్వే పనివారలు, మద్రాస్ బట్టల పనివారలు, బెంగాల్‌లోని జనపనార మిల్లుల లోని పని వారలు తీవ్రమైన సమ్మెలు చేశారు. జి. ఐ. పి. సమ్మెలో జోషీ పార్టీ మామూలు వలె, యజమానుల పక్షము చేరి సమ్మె అంతరింప ప్రయత్నించింది. సమ్మెదారులు, నేషనల్ కాంగ్రెస్ అధ్యక్షుడగు నెహ్రూ గారికి ఉత్తరము వ్రాయుచు, ఈ సమ్మె ద్వారా, దేశముయొక్క ఆర్థిక రాజకీయ మోక్షము సంపాదించుడని కోరిరి. కాని అది సమయము కాదని జవహరి లాల్ నెహ్రూ నిరాకరించెను. జవహరిలాల్ నెహ్రూ కాం గ్రెసు కార్యక్రమములో పడి, కార్మిక కార్యక్రమము సూచిం చుట లో వెనుదీయుచుండెను. బహుశః నెహ్రూ గారికి అప్ప టికి సామ్యవాద ఆశయములు పరిపక్వత చెందలేదేమో. దీనిచే సమ్మె అంతరించింది.

1932 లో, యం. యస్. యం. రైల్వే వర్కుషాపులో సమ్మె ప్రారంభ మయింది. కొంతమంది పనివారలను తొలగించుట సమ్మెకు ముఖ్య కారణము. ఈ సమ్మె క్రమముగా, అరక్కోణం, హుబ్లి వర్కు షాపుల లోని కూడ ప్రాకిపోయింది. రెండు మూడు మాసములు సమ్మె దారులు ధైర్యోత్సాహముతో పోరాడిరి. విదేశముల నుండి కూడ ధన సహాయము లభించింది. కాని సమ్మెకు నాయకత్వము వహించిన మితవాదులగు గిరి, మెహతా గారలు, రైల్వే ఏజంట్లతో సంధి చేసికొనిరి. సమ్మె చేయు కాలములో కొందరు, పోలీసువారలతో సంబంధము పెట్టుకొని సమ్మెదారులకు తీరని నష్టం కల్గించారు. సమ్మె అంతరించినది. నేటికి ని యం. యస్. యం. రైల్వే యూనియను క్షీణదశలో నున్నది. కారణము మితవాద నాయకత్వమే.

1930 - 31 లో చాలా భయంకరమైన పోరాటమే జరిగినది. బొంబాయి, షోలాపూర్, నాగపూర్, కోలక్ లలో చాలా తీవ్రంగా కార్మికులు పోరాడారు. షోలాపూర్ లో, కార్మికులు, కాంగ్రెసు వలంటీర్లతోను, పోలీసులతోను, సోల్జర్లతోను, పోరాడ వలసింది. దక్షిణ ఇండియా లో తిరుపూరు లో వ్యవసాయకూలీల సమ్మె జరిగింది. బీరార్ లో వ్యవసాయ కూలీల, సమ్మెలుకూడ హెచ్చినవి. 1932 లో డాక్ వర్కర్స సమ్మెకూడా జరిగింది.

1930 - 31 - 32 సంవత్సరాల లో సమ్మెలు విజృంభించినా, కార్మి కోద్యమం వృద్ధిపొంద లేదన వచ్చు. బొంబాయిలో నిరుద్యోగుల సంఖ్య 70 వేలమంది. జూట్ మిల్లులలో దాదాపు సగం మంది నిరుద్యోగు లయారు. రైల్వేలలో, సమ్మెలు ఓడటం చేత అనేక వేలమంది పనినుండి తొలగింపబడ్డారు. పని చేసేవాళ్ళకు సంతృప్తి కరమైన జీతము, పూర్తి జీతాలు దొరకడం లేదు. 1932 లో మద్రాస్ లో ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సమావేశం జరిగినపుడు ముప్పది మంది ప్రతినిధులు మాత్రమే వచ్చారు. ఈ సమావేశము ఉత్సాహ వంతంగా లేదు. ఈ సమావేశం వల్ల కార్మికులలో క్రొత్తగా శక్తి ఏమీ జనించ లేదు.

---

# భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

## (7)

## 1933 - 1934.

### ఆల్ ఇండియా టెక్స్టైల్ సమ్మె.

1933 సంవత్సరం డిశంబరులో కాన్పూరు నందు ఆల్ ఇండియా ట్రేడ్-యూనియన్ కాంగ్రెసు సమావేశం జరిగింది. 1929 వ సంవత్సరంతర్వాత, శక్తి, జీవనం కన్పడిన దీసమయం లోనే. హిందూదేశము నుండి పలు ప్రాంతాల నుండి తగిన ప్రతినిధులు సమావేశం లో పాల్గొన్నారు. ఒక ప్రక్క ప్రతి దినం, హిందూదేశపు పెట్టుబడి దారుల అక్రమాలు విజృంభిం చుతుంటే మితవాదులు మాత్రం, ప్రభుత్వపు కమీషన్లు, జనీవా సభలలో కాలము వృధాపరచు చున్నందుకు కార్మికు లకు వారి పై అసంతృప్తి గల్గింది.

ఈ సమావేశం ~~లోనే~~ మొట్ట మొదట హిందూదేశ మంతా, బట్టల మిల్లులవారు సమ్మె చేయాలని తీర్మానించారు.

1933 లో వరుస వరుసగా అహమ్మదాబాదులో సమ్మెలు జరిగినవి. కాని నాయకత్వము పెట్టుబడిదారుల ఏజంట్ల దగుటచేత చాలాసార్లు విఫలమయినవి. ఈ సమయం లో కార్మికుల వర్గచైతన్యం (Class conciousness) చూచి మిల్లు యజమానులు ఎలా భయపడు చున్నారో గమనించండి.

ఒక మిల్లు యజమాని యగు యస్. కె. రుద్రా గారు "మార్క్సు గారి భావసారమును, కార్మికుల తలల లోకి, కొంచెం నీళ్ళ యినా కలపకుండా, అవిధంగానే, ఫిల్టర్ చేస్తున్నారు. ఇది ఎప్పటికైనా క్లిష్టమైన పరిస్థితుల లోకే తీసుకొని రాకపోదు" అని అన్నారు. ఇలాంటప్పుడు, కార్మికులకు, యజమానులకు, తగవులేదని, అది కొందరు కల్పించు చున్నారని అనేవారి మాట లకు అర్థం ఉందా ?

1934 జనవరి 30 వ తేదీన ఆల్ ఇండియా టెక్స్టైల్ లేబర్ సమావేశం జరిగింది. దీనిలో సంస్కార వాదులగు జోషీపార్టీ పాల్గొన లేదు. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రెసి డెంటే, ఈ సమావేశపు ప్రెసిడెంటు. స్వయంగా ఈయన సం స్కారవాదుల నాహ్వానించుచు ఒక జాబు వ్రాశాడు. కాని వారు పాల్గొనలేదు. కలకత్తాలో విడిపోయిన రెడ్ ట్రేడుయూ నియను కాంగ్రెసు వారు కూడ, టెక్స్టైల్ లేబర్ ఎసోసియేషన్ లో పాల్గొన్నారు. ట్రేడు యూనియన్ కాంగ్రెసుకు సంబం ధించిన నేత కార్మిక సంఘాలు దీనితో సహకారం చేసెనయి. సమ్మె చేయాలన్న తీర్మానం ప్యాసయింది. మే మొదటి తేదీ సమ్మె చేయాలని నిశ్చయింప బడినది.

ఈ దేశవ్యాపితమైన సమ్మెను ఫైసలా చేయడానికి, ఈ క్రింది కోర్కెలు పూర్తి చేయాలని, ఈసంఘం వారు కోరారు.

(1) కూలిలో యికముందు తగ్గింపు ఉండరాదు. 1933 జనవరినుండి తగ్గించిన మొత్తములను పూర్తిచేయాలి.

(2) మిల్లు యజమానులు, రేషనలిజేషన్ ద్వారా, క్రొత్తమెషిన్లు తగిలించి, ప్రతి-చోటా వేలకొలది కార్మికులను తగ్గించి, వెళ్ళగొట్టు తున్నారు. ఆ పద్ధతిని ఆపుచెయ్యాలి.

(3) ప్రభుత్వము యొక్కయు, మిల్లు యజమానుల యొక్కయు, ఖర్చులతో, నిరుద్యోగ భీమా, గర్భిణీ స్త్రీలు, ప్రసవించిన స్త్రీలును, అగు కార్మికులకు సహాయం, చేయుటకు ఏర్పాట్లు గావించాలి.

(4) కార్మికులను నౌకరినుండి తొలగింపరాదు.

(5) స్త్రీపురుష భేదం లేకుండా, తెల్ల నల్ల రంగు భేదం లేకుండా, సమానమైన పని ననుసరించి, సమానమైన జీతం ఈయాలి.

(6) కూలి తగ్గించకుండానే, కార్మికుల చేత పగలయితే 8 గంటలు, రాత్రి అయిన 7 గంటలు, మాత్రం పని చేయించు కోవాలి.

(7) ప్రతి సంవత్సరం, పూర్తిజీతంతో పాటు ఒక మాసం సెలవియ్యాలి.

(8) కనీసం నెల జీతం 45 రూపాయ లుండాలి.

(9) కార్మికు లెన్నుకొన్న కమిటీల ద్వారా క్రొత్తకార్మికులను చేర్చుకోవాలి.

(10) కార్మిక సంఘానికి, మిల్లులలోపల ప్రచారం చేసుకొనేందుకు, పూర్ణస్వాతంత్రం వుండాలి. మిల్లుల లోపల కార్మికుల పరిస్థితులు పరిశీలించేందుకు, మిల్లులోని కార్మిక సంఘానికి అధికారం ఉండాలి.

(11) కార్మిక సంఘాలలో పని చేస్తున్నాడన్న కారణం చేత, కార్మికుడెవడూ పని నుండి తొలగింపబడ కూడదు.

(12) ఇంటి అద్దెలు సగం [50 0/0] తగ్గించాలి.

(13) సెలవుల విషయంలో, నిశ్చిత రూపమయిన, సంతోషకరమైన నియమాలు ఉంచాలి.

(14) 16 ఏండ్లకు తక్కువ వయస్సు గలవారిని పనిలో చేర్చుకోరాదు.

(15) కార్మిక సంఘాలను, మిల్లు యజమాను లంగీకరించాలి.

(16) ఒకే రకంగా జీతాలు ఈయాలి.

(17) కార్మికులు, మీటింగులు, ఉపన్యాసాల ద్వారా సంఘటనం చేసికొనేందుకు అధికారం ఉండాలి.

(18) సమ్మె, పికెటింగు చేయడానికి స్వాతంత్ర్యం ఉండాలి.

(19) స్వదేశ సంస్థానాలలో కార్మిక సంబంధమయిన చట్టాలు నిర్మించాలి. అచటగూడ కార్మికులను సంఘటన మొనర్చుటకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండాలి.

(20) సమస్తమైన నిర్బంధ చట్టములను రద్దు చేయాలి. సమస్త రాజకీయ ఖైదులను విడుదల చేయాలి.

సమ్మెను వర్ణించటానికి ముందు ప్రభుత్వ వైఖరి గమనించాలి. 1918 లో దేశమంతా సమ్మెలు జరిగినప్పుడు ప్రభుత్వం తటస్థంగావుంది. అప్పటి కార్మిక నాయకత్వం మితవాదులది. అది ధనాఢ్యులకు గాని, ప్రభుత్వానికి గాని భయం కల్గింపలేదు. కాని కార్మికులలో వర్గ చైతన్యం కల్గి వర్గకలహ ఆధారంతో తమను బాగుచేసుకోవాలని భావము ప్రబలింది. కేవలం పెట్టుబడిదారులనే గాక, వారిని పోషించే ప్రభుత్వాన్ని గూడ కార్మికులు ఎదుర్కొనాలని తెలుసుకొన్నారు. అప్పుడే ప్రభుత్వం బయటపడింది. బహిరంగంగా యజమానులకు, పెట్టుబడిదారులకు సాయము చేయ నారంభించింది. 1928 లో జరిగి బొంబాయి సమ్మెలలో లాఠీలు, తుపాకిగుండ్లు ఉపయోగింప బడినయి పబ్లిక్ సేఫ్టీ ఆర్డినెన్సు, ట్రేడ్ డిస్ప్యూట్ ఆక్టులు వెలసినవి. కార్మిక నాయకులు జైళ్ళలోనికి త్రోయబడ్డారు. 1928 - 29 సమ్మెలవల్ల ధనాఢ్య వాదాన్నెదురుకోవాలంటే అధిక శక్తితో నిలబడాలని కార్మికులు తెలుసుకొన్నారు. 1918 - 19 కంటె, 1928 - 29 లో కార్మికులలో వర్గచైతన్యము హెచ్చయింది. అందుచేతనే మీరట్ కేసులో కార్మిక నాయకులు ఘోరముగ శిక్షించబడ్డారు. 1934 లోని సమ్మెను గూడా అంతరింప చేయటానికి ప్రభుత్వం గొప్ప ప్రయత్నాలు చేసింది.

మొట్ట మొదట షోలాపూర్ లో కార్మికులు సమ్మెచే శారు. తమ కేవిధమయిన నష్టం లేకపోయినా, యజమానులు నూటికి 12 చొప్పున తగ్గించారు. దీనిని నిరసించుతూ కార్మికులు సమ్మె చేశారు. సమ్మె ప్రారంభంలోనే 144 శెక్షన్ నియోగిం చారు. సభలు ఊరేగింపులు నిలుపు చేశారు. నిరాటంకంగా లాఠీల నుపయోగించి, నాయకులను జైళ్ళలోకి త్రోశారు.

1934 ఏప్రియల్ 23 వ తేదీన బొంబాయి లో సమ్మె ప్రారంభ మయింది. మొదటి రోజున, 6-7 మిల్లులు మూయ బడినవి. కాని నెమ్మదిగా సమ్మె ధృఢ మయినది. ఒక వారం లో 80 వేల మంది సమ్మె చేశారు. బొంబాయిలో, మూడు మిల్లులు తప్ప అన్నీ మూయ బడినవి. హోం మెంబర్ తట స్థంగా ఉంటామని ప్రకటించినా, తర్వాత ప్రభుత్వం జోక్యం కలుగ జేసికొంది. అన్ని మిల్లుల లోను, కార్మికుల బజార్ల లోనూ, పోలీసు కాపలా వుంచారు. సమ్మె రెండవ దినము ననే, ఛార్లెస్ మెస్కారనస్, మణిబెన్, కార్నిక్ ఆదిగాగల నాయకులను అరస్టు చేశారు. లాఠీవర్షంతో పోలీసులు కార్మిక ఉత్సవాన్ని చిందర వందర గావించారు. మూడవ దినం 144 సెక్షన్ ప్రయోగించి, మిల్లులలో, ఉత్సవాలు సభలు నిషేధిం చారు. ఏప్రియల్ 27 వ తేదీన కొందరు మిల్లు యజమానులు పని ప్రారంభింప యత్నించారు. సమ్మె దారులు పట్టుబట్టారు. కార్మికులను పికెటింగు చేయు వారిపై లాఠీ వర్షం కురిపిం

చారు. కాని కార్మికులు యుద్ధ రంగం వీడ లేదు. వాళ్లు రాయి అప్ప తీసుకొని పోలీసులను కొట్టారు. ఇంకులక్కై, తుపాకులు ప్రేలినవి. సాయంత్రం మరల గుండ్ల వర్షము. కార్మికుల లో ఒకడు చని పోయాడు. 40 మంది గాయపడ్డారు. మే 1 వ తేదీన బొంబాయి కార్మిక నాయకులను ప్రత్యేక ఆర్డినెన్సుల ననుసరించి అరస్టు చేశారు. అరస్టులు విజృంభించినా, లాఠీ పోటులు తగులుచున్నా, గుండ్లవర్షం కురుస్తున్నా, రక్తపాతం జరుగుచున్నా, ఆకలితో నసించుతున్నా, కార్మికులు తమ స్థలాల నుండి కదలలేదు.

ఒక ప్రక్క ప్రభుత్వం నిర్బంధించు తున్నది. ఇంకొక ప్రక్క మిల్లు యజమానులు ఎత్తు పై ఎత్తులను పన్నుచున్నారు. మిల్లు గేట్లవద్ద, కార్మికులను ఆకర్షించడానికి, చేతులు త్రిప్పుకుంటూ, తెల్ల చీరలు గట్టుకొని నాట్యంచేసే, కొజ్జా వాళ్ళను నిల్పారు. కార్మికులా వింతలను చూడటానికి వస్తే, గేట్లలోపలకు త్రోసి, కార్మికులు పనిలోకి వచ్చారని అసత్య వార్తలు ప్రచారం చేసి, కార్మికులలో చీలిక గల్గించాలని వారి ఆశయం. కాని ఒక్కడూ కదల లేదు. అంత తెలివి తక్కువ వారు కారు కార్మికులు. ఇంకా కొందరి సన్యాసుల, మత గురువుల, మహంతులను నియమించారు. వారు "కార్మిక నాయకులు నాస్తికులు. అధర్ములు. వాళ్ళమాటలు వినవద్దు" అని ప్రచారం చేశారు. కాని కార్మికులు "యజమానులకు ఏజం

టుతై. మీరు చెప్పు సారంగనీతులు మా కక్కర లేదు పొండి". అన్నారు. సమ్మె మామనన్ని విమానములపై నుండి కరపత్రాలు పంచిపెట్ట సాగారు. కాని కార్మికశక్తి లేవిహ చలించలేదు. 45 దినములు లాఠీ దెబ్బలకు, గుండు దెబ్బలకు సహించుతూ, మిల్లు యజమానుల కుయుక్తుల నెదిరించుతూ, ఆకలి చిచ్చును లెక్క చేయక గొప్ప పోరాటము సాగించారు. కాని ధనబలం ముందర ఎన్నాళ్ళు నిలుస్తారు కార్మికులు? సమ్మె చెడిపోయినది. సమ్మె శిథిలమవడానికి ఇంకా కారణాలు కొన్ని ఉన్నవి. అది మితవాదుల వైఖరి.

మితవాదులు సమ్మెకు సాయం చేయలేదు. సరిగదా వ్యతిరేక ప్రచారం చేశారు. శివరావు సమ్మెకు ముందే వ్యతిరేక ప్రచారం ప్రారంభించాడు. జోషీ కూడ, ఆకాలాని కది తగదని, నిరర్థకమని తెల్పాడు. ఒక నెలవరకు, వీరు బయట నుండి తమాషా చూస్తున్నారు. సమ్మె నాయకులందరూ జైలుకు నడిచారు. ఇది మంచి సమయం. ఈ సమయంలో కార్మిక నాయకత్వం వహించి తమ నాయకత్వం నిల్ప కొంటానికి అదను. అందుకని సమ్మె కమిటీలో తమ్ము తీసుకోమని అర్థించారు. ఈ విషయంలోనే కమిటీలో అభిప్రాయ భేదాలు కలిగినవి. కమ్యూనిష్టులు వీరిని కల్పుకో వద్దన్నారు. వీరిని కల్పుకోవడం వల్ల మితవాద నాయకత్వం నెత్తిన దెచ్చుకొని పోవడమనీ, వీరి అభిప్రాయం. మరి కొందరు ఈసమ

యం లో వీరి సహాయం అవసరమని తలిచారు. దానిచే చీలిక లు గల్గినవి. ఒకటిగా కలసి పని చేయలేక పోయారు. 45 దినములు నిర్విఘ్నంగా సాగిన సమ్మె సంస్కారవాదులు అడుగు పెట్టిన రెండు వారాల కే అంతరించింది.

ఈ సమ్మెతో పాటు అహమ్మదాబాదు షోలాపూరు, ఢిల్లీ కాన్పూరు లలో కూడ సమ్మెలు జరిగినవి. కార్మికులు, పెట్టుబడిదార్లు, వారి ఏజంటగు ప్రభుత్వం తోనూ, ప్రతిస్థలం లోనూ పోరాడారు. నానా బాధల సహించారు. జైళ్ళకు వెళ్లారు. ఆకలితో చచ్చారు. లాఠీ పోట్లు భరించారు. గుండు దెబ్బలకు గుండెల నిచ్చారు. మరి కొందరి పై ట్రేడ్ డిస్ప్యూట్ ఆక్టు ననుసరించి కేసు పెట్టబడింది. మొత్తం, ఈ సమ్మెల తో 2 లక్షల మంది పాల్గొన్నారు.

ఈ సమ్మెల వలన కార్మికులకు గల్గిన లాభ మేమని అనేకమంది ప్రశ్నిస్తున్నారు. ఈ సమ్మెదారుల కోర్కెలన్నీ పూర్తి కాక పోవచ్చును గాని, దేశంలో గొప్ప రాజకీయ పరిజ్ఞానం కల్గిందని చెప్పక తప్పదు. కార్మికుల లో దిన దినమూ, వర్గ చైతన్యం (Class Conciousness) వృద్ధి పొందు తుంది. కార్మికులు ధనాఢ్య వాద సంఘం లో బ్రదుకుట దుర్లభమని తేలి పోయింది. పెట్టుబడి దారల ప్రభుత్వ వైఖరి సమ్మెల సమయం లో ఎలా ఉంటుందో తెలిసింది. కార్మికులకు, పెట్టు

బడి దారులకు సంధి కుదురుతుంది, వారు తండ్రీ బిడ్డల వలె మెలగవచ్చునన్న బూటకపు మాటల పస తేలి పోయింది. కార్మిక ధనాఢ్య వర్గాలు పరస్పరమూ, విరోధకములు. వాటి రెండిటి స్వార్థము, ఒక దాని కొకటి ప్రతికూలము. ఆ రెండిటి కలయక అసంభవ మని తేలింది. పెట్టుబడి దారులకు సహాయం చేయకుండా ప్రభుత్వం ఊరక ఉండ లేదని కార్మికులు తెలిసి కొన్నారు. ధనాఢ్య సంఘం లో ఉండే ప్రభుత్వం, తప్పక ధనాఢ్యులకు ఏజంటుగా వర్తించాలి. కాబట్టి కార్మికులు పెట్టుబడిదారులతో పోరాడుట అంటే, ప్రభుత్వం తో కూడ పోట్లాడుట అని తెలసి కొన్నారు. ప్రస్తుత మీాసంఘంలో ఉన్న కార్మికుల కష్టాలు పోవాలంటే ఏం చేయాలి? కార్మికుల లో వర్గ చైతన్యం (Class Conciousness) వృద్ధి పొందాలి. వర్గ యుద్ధం (Class war) మీాద ఆధార పడాలి. కార్మి కోద్యమం, కేవలం ఆర్థికం గానే గాక రాచకీయంగా ఉండాలి. అందుచేతనే హిందూదేశం లోని దారిద్ర్యము పోవా లంటే సామ్యవాదమే శరణ్యం. సామ్యవాద సంఘాలు ఈ భావాలను కార్మికుల లో ప్రచారం చేస్తున్నవి. 1918-19 లో కార్మికోద్యమం కేవలం ఆర్థిక దృష్టి తోనే నడుప బడింది. 1928-29 లో కార్మి కోద్యమము, మితవాద నాయకత్వము చాలవరకు విడిచినది. 1934 నాటికి కార్మిక వర్గము, పెట్టుబడి దారులకు, చాల భీతిని కల్గించినది. కార్మికులకు సామ్యవాదమే

శరణ్యము అను స్థితి వచ్చింది. ఈ సామ్యవాదమును ప్రచారం చేసింది ముఖ్యంగా కమ్యూనిష్టులు. ఇట క్లుప్తంగా కమ్యూనిష్టు ఉద్యమాన్ని గురించి చెప్పుతాను.

మొదట హిందూ దేశంలో 1923 లో కమ్యూనిష్టు పార్టీ ఏర్పడింది. కాని త్వరలోనే అంతరించింది. తర్వాత 1928 నుండి మరల తలయెత్తింది. విశేష ప్రచారం గావించి, అనేక కార్మిక సంస్థలను వశ పఱచుకొన్నది. కాని, ఎం. ఎన్. రాయి గారి వలన కొద్దిగా చీలికలు కలిగినవి. అయినను కార్మికుల లో పలుకుబడిని సంపాదించి, తదితర బూటక నాయకులను వెల్లడి చేయుచు తీవ్ర ప్రచారము గావించింది. దాని ఫలితంగా మీరట్ టులో అనేకమంది శిక్షింప బడ్డారు. తర్వాత 1934 సంవత్సరము జూన్ 23వ తేదీన కమ్యూనిష్టు సంఘము అక్రమ సంఘముగా ప్రకటింప బడ్డది. దీనిచే అనేక సంఘములు రద్దయినవి. సత్యాగ్రహం కోసరం పెట్టిన ఆర్డినెన్సును పొడగించుతూ ప్రభుత్వం "దేశంలో సత్యాగ్ర హోద్యమం చచ్చినా, కమ్యూనిజం చావలేదు. కాబట్టి ఈ ఆర్డినెన్సు పొడిగింప వలసి వచ్చింది" అని అన్నది. అయినను దేశంలో కమ్యూనిజం చచ్చినట్లు కనపడదు. ప్రభుత్వము చేయు అరస్టుల వలనను, సోదాల వలనను, పలు తావుల యందు రహస్యముగ కమ్యూనిష్టు ప్రచారము జరుగుచున్నట్లు తెలియుచున్నది.

ఇట్లు 1934 వ సంవత్సరం, భారత కార్మిక చరిత్రలో ఉన్నత స్థానమును పొందింది.

# భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

## (8)

## 1935 - 1936.

### కార్మిక సంస్థల సఖ్యత.

---

1935-36 వ సంవత్సరం లోని కార్మి కోద్యమాన్ని గురించి చెప్పుటకు ముందు, నాగపూర్ కాంగ్రెస్ చీలికల నుండి ప్రస్తుత సమావేశము వఱకు జరిగిన పరిస్థితుల విచారించుదాం.

నాగపూర్ కాంగ్రెస్ లో అతివాద వైఖరివలన, సంస్కార వాద పక్షము విడిపోవు నట్లు చేశారు. మరల కలకత్తా సమావేశము లో గూడ కమ్యూనిష్టుల తీవ్రవైఖరియే చీలికలకు కారణమయింది. అభిప్రాయ భేదములతో, కార్మిక నాయకులు, కార్మికులకు తీరని నష్టం కల్గించారంటంలో తప్పులేదు. ఆశయముల లో భేద మున్నప్పటికి, కార్మికుల కనీసపుకోర్కెల పోరాటము లో అందరుకలిసి పని చేసిన బాగుండెడిది. ఈ

తప్పులను త్వరలోనే దిద్దుకొనుట సంతోషదాయకము. కలకత్తా సమావేశంలో, గిర్నీ కాంగార్ యూనియన్‌ను, యస్. వి. దేశపాండే, జి. హెచ్. కండాల్కర్, ఇరువురూ, తమదే నన్నారు. చివరకు అధ్యక్షుడగు సుభాస్ చంద్ర బోస్, కండాల్కర్‌గారిదేనని తీర్మానించారు. దేశపాండేగారు మరియొక రెడ్ గిర్నీ కాంగార్ యూనియన్ స్థాపించారు. ఈ విధంగా 3 భాగాలయిన ట్రేడ్ యూనియన్, మరల 1934 నుండి కొద్ది కొద్దిగా జీవం పోసుకొంది. 1934 టెక్స్టైల్ సమ్మెలో కమ్యూనిస్టుల కాంగార్ యూనియన్ సహకారం చేసింది. కాని జోషి పార్టీ కలియ లేదు. తర్వాత హరి నారనాథ శాస్త్రీగారి ఆధిపత్యం క్రింద కలకత్తా సమావేశం జరిగి నపుడు కమ్యూనిస్టులు ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, లో కలిశారు. ఇక మిగిలినవి ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ మాత్రమే. ఈ ఫెడరేషన్ బొంబాయి సమావేశమున, ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌తో సఖ్యత చేసికొనక ముందు ఎన్ని రూపములు పొందినో, ఇచట క్లుప్తంగా చెప్పుతాను.

ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్, అని రెండు భాగాలుగా విడిపోయి నప్పటినుండి, కొన్ని రైల్వే సంస్థలు, మరియొక " ఆల్ యిండియా రైల్వే

ఫెడరేషన్" స్థాపించారు. ఇదిగాక మరికొన్ని కార్మిక యూని యన్లు "నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్"గా ఏర్పడినయ్. ఆల్ ఇండియా రైల్వే ఫెడరేషనుకు, ఆల్ ఇండియా కాంగ్రెస్‌కు సఖ్యతకై 1931 లో ప్రయత్నాలు జరిగినయ్. కాని కాంగ్రెస్ రైల్వే ఫెడరేషన్ తో సహకారం చేయలేదు. కాని ట్రేడ్ యూనియను ఫెడరేషను మాత్రం సహకారం చేసింది. ఇంకా 1933 లో జరిగిన ఫెడరేషన్ వారి ప్రత్యేక సమావేశ ఫలి తంగా, "ఆల్ ఇండియా ట్రేడ్స్ యూనియన్ ఫెడరేషన్ నేషనలు ఫెడరేషను ఆఫ్ లేబర్" కలసి నేషనల్ ట్రేడ్స్ యూనియన్ ఫెడరేషన్ గా మారింది.

ఈ నేషనల్ ట్రేడ్స్ యూనియను ఫెడరేషను యొక్క ఆశయాలు ఇవి.

(1) సోషలిస్టు స్టేట్‌ను ఇండియా లో స్థాపించటం.

(2) ఉత్పత్తి, పంపకం, మారకం, సాధ్యమైనంత వరకు, సంఘ జాతి పరముల చేయుడం ( Socialise & nationalise).

(3) కార్మిక వర్గం యొక్క ఆర్థిక సాంఘిక స్థితిని బాగు పరచటం.

(4) హిందూ దేశపు రాజకీయ స్వాతంత్ర్య యుద్ధం లో కార్మిక ప్రకర్షణంతో, న్యాయ యుతమై, శాంతి యుతమైన

డెమాక్రటిక్ పద్ధతులతో (లెజస్లేషన్, సంధి, ప్రచారము, సమ్మెలు మొదయిన పద్ధతులు) పాల్గొనటం.

నేషనలు ట్రేడ్స్ యూనియన్ ఫెడరేషన్ మొదటి సమావేశం బొంబాయిలో 1933 డిశంబర్ లో జరిగింది. ఫెడరేషను ప్రెసిడెంటగు మృణాళి కాంత బోస్ గారు అధ్యక్షత వహించారు. ఈ సంస్థ క్రింద 50 యూనియనులు, 1,37,000 నుండి మెంబర్లు ఉన్నారని తెలుపబడింది. రెండు సంవత్సరాల వరకు, ఇంటర్నేషనలు ఫెడరేషను ఆఫ్ ట్రేడ్సు యూనియనుల తో దీనిని కలపాలని తీర్మానించ బడింది.

కాని మొదటి సమావేశం లోనే భేదాలు కల్గినయ్. బెంగాలు ప్రతినిధులు చాలమంది లేచి వెళ్ళారు. ఆ రోజునే అబ్దుల్ ఘూని గారి ఆధిపత్యం క్రింద జోషీ గారు, మరియొక ఆల్ ఇండియా ఫెడరేషను ఆఫ్ లేబరు స్థాపించారు. కలకత్తా దీనికి ముఖ్యస్థానం. యం. దావూద్, ఎం. ఏ. గారు ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డారు.

ఇట్లు వివిధ రూపములు చెందిన ఆల్ ఇండియా ట్రేడ్సు ఫెడరేషను, బొంబాయి సమావేశం లో కాంగ్రెసు తో సఖ్యత చేసికొనడం చాల సంతోషకరమైన సంగతి. ఆశయ భేదాలు ఉండవచ్చు. కాని కార్మికుల కనీసపు హక్కులకై యాజమా

నులతో పోరాడుటకును, సామ్రాజ్య వాదాన్ని ఎదుర్కొం టానికి అన్ని కార్మిక సంస్థలతోను, సామ్రాజ్య వాద ప్రతి కూలు రందరితోను, సఖ్య మొనర్చవలసిన బాధ్యత తీవ్రవా దులకు గలదు.

రెండు సంస్థల సఖ్యతకై 1933 లో ఒక యూనిటీ కమిటీ ఏర్పరచ బడింది. 1935 వ సంవత్సరమునకు ట్రేడు యూని యన్ కాంగ్రెసు ప్రెసిడెంటుగా ఎన్నుకొన బడిన రూయికర్ గారు మొదట నుండి సఖ్యతకై యత్నించు చుండెను. చివరకు ప్రభుత్వ నిర్బంధానికి గురియై జైలుకు వెళ్ళుతూకూడ (1935 ఏప్రియల్ లో ఒసంగిన ఉపన్యాసమునకై శిక్షింపబడిరి. 1936 మార్చి 3 వ తేదీన కలకత్తా హైకోర్టులో శిక్ష ఖాయ పరుప బడింది.) ఇలా అన్నాడు.

"ఫెడరేషన్ మిత్రులగు, వి. వి. గిరి మొదలగు వారు చిన్నచిన్న విభేదముల మఱచి పోతారని నమ్ముతాను. క్రొత్త రాజ్యాంగ ప్రణాళిక అను రూపంతో ఒక పిశాచం,మనకార్మిక వర్గమును, మాతృభూమిని ఆవహిస్తోంది. అందుకని, లిబరల్స్, కాంగ్రెస్ మెన్, నేషనలిస్టులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, అందరూ చిన్న చిన్న విభేదముల మఱచిపోయి, రాజ్యాంగ ప్రణాళిక రద్దు చేయబడునట్లు, సంయుక్తమగు పోరాటం సాగించాలి"

రెండు సంస్థలు 1935 అగస్టులో ఒకజాయింటుబోర్డును ఏర్పఱచినయి. డిశంబరు లో నాగపూరు లో సమావేశమై కూడా ఎట్టి నిర్ణయానికి రాలేక పోయారు. ఈ జాయింటుబోర్డు యొక్క జనరల్ కౌన్సిల్ 1936 జనవరి లో సమావేశమయింది. కొన్ని సూచనలు గావింప బడినయి. తుదకు 1936 మే 17 వ తేదీ జరిగిన బొంబాయి సమావేశం లో రెండు కార్మిక సంస్థలకు సఖ్యం కుదిరింది. సంధికి గిరిగారు కొన్నిసూచన లిచ్చారు. తుదకు సంధిషరతులు ఇవి.

(1) ట్రేడ్ యూనియన్ కాంగ్రెసే కేంద్రసంస్థగా ఉంటుంది.

(2) ఫెడరేషన్, దాని కనుబంధంగా ఒక సంవత్సరం వరకు ఉంటుంది.

(3) ఈ రెండు యూనియన్ల కార్యనిర్వాహక వర్గముల యొక్క జాయింటుకమిటీ లో 75 % చెప్పినట్లు తప్ప అన్యధా, రాజకీయంగా గాని, సమ్మెలు మొదలైనవి గాని, నడపరాదు. రాయబారము లో పనిచేసిన జవహార్లాల్ గారు, 100 కి 75 బదులు 67 గురు చెప్పినట్లుమాత్రం చేయ వచ్చునను సవరణను సూచించిరి. ఈ సవరణ లేకుండగనే సంధి కుదిరినది. కాని గిరి గారు సూచించిన మొదటిషరతు, "ఫెడరే

షన్ తానిపుడు నడుచు కొనుచున్న ప్రత్యేక నిబంధనల ప్రకారం ఏడాదిపాటు నడుచుకొనవచ్చు నని ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అంగీకరింప వలెను," అనుదానిలో, కాంగ్రెస్ కార్య నిర్వాహక కమిటీ త్వరలో సమావేశమై కాంగ్రెస్‌తో ఏడాది పాటు చేరుచున్న ఫెడరేషన్‌లో, నిబంధనల లో మార్పు లవసరమని తోచినచో, ఆ మార్పులు ఫెడరేషను అంగీకరించుట అవసరం" అన్న సవరణతో అంగీకరింప బడింది. ఇలా తాత్కాలిక సంధి జరిగింది. 1929 లో గల్గిసచీలికలు 1936 లో సమసిపోయినయ్.

---

# బొంబాయి సమావేశం.

---

## ట్రేడ్ యూనియను - నేషనల్ కాంగ్రెసుల సంబంధము.

1936 మే 17 వ తేదీన బొంబాయిలో ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సమావేశం జరిగింది. దీనిలో కార్మిక సంస్థల సఖ్యతయేగాక రాజకీయ జాగృతి కానవచ్చుచున్నది. ఈ సమావేశానికి, ఆంగ్ల కార్మిక నాయకులగు సర్ స్టాఫర్డ్ క్రిప్సు గారు ఇలా సందేశం పంపారు.

భారతీయ కార్మికోద్యమ చరిత్ర.

"ప్రపంచ మందంతటా, పరిశ్రమల యజమానులగు పెట్టుబడి దారులకును, కార్మికులకును, పోరాటలు జరుగు చున్నాయి. ప్రపంచ కార్మికు లందరూ ఏకం గావడం అవసరం. ప్రస్తుత సామ్రాజ్యభావం నశించి, సర్వ సమమగు హక్కులు గల ప్రపంచ రాజ్యాం స్థాపించబడితేగాని ప్రపంచం లోని, గడ బిడలు తొలగవు. ఇండియాలో, కార్మికులు, వ్యవసాయ కార్మికులతో కలిస్తే గాని, వారి బలం అధికం కాజాలదు. సమావేశం తగిన నిర్ణయాలు చేయుగాక."

ఆహ్వాన సంఘాధ్యక్షులగు జాబ్వాలా గారు ఇలా ఉపన్యసించారు. "పరిశ్రమల యజమానులు ఖర్చు తగ్గించుకొందా మనే ఉద్దేశ్యంతో, కార్మికుల కిచ్చే కూలీ మొత్తాన్ని తగ్గిస్తున్నారు * * * రెండు కార్మిక సంస్థలు ఏకమవడం ముఖ్యావసరం. నేషనల్ కాంగ్రెసుతో హెచ్చుసంబంధం చేసుకోవాలి * * ". తర్వాత అధ్యక్షు రాలగు శ్రీమతి మణిబెన్ మూల్జీగారు ఇలా ఉపన్యసించారు." కార్మికనాయకుల్ని చెరసాలలలో ఉంచి ప్రభుత్వం నిరంకుశ విధానాన్ని విచ్చల విడిగా సాగిస్తున్నది. కార్మి కోద్యమాన్ని అణచివేయడానికి, ప్రపంచం లో ఫేసిజం తల యెత్తుచున్నది. మన నేషనల్ కాంగ్రెస్‌లో కూడ అటువంటిదే వుంది. దానిని మొదటే పెళ్లగించక పోతే పెద్దగా పెరుగుతుంది * * * * క్రొత్త రాజ్యాంగం మనబానిసత్వానికి మరొక నూతనచిహ్నం.

క్రొత్త రాజ్యాంగాన్ని భగ్నం చేయడానికి అన్ని పక్షాల వారు ఏకం కావాలి * * * ప్రభుత్వ సమ్మతి ప్రకారం ఆడవలసిన మంత్రిపదవుల స్వీకరించడం కంటె వేరే వెట్టి ఏమీ ఉండదు. * * ఐకమత్యమున్నగాని పెట్టుబడి దారుల చర్యలను, కార్మికులు ప్రతిఘటించుటకు చాలి యుండదు."

ఈ సమావేశముననే, కార్మికులకు, జాతీయ కాంగ్రెసునకు ఎట్టి సంబంధం ఉండాలను ప్రశ్న వచ్చింది. నేషనల్ కాంగ్రెస్ అధ్యక్షుడగు జవహరిలాల్ గారు కూడ ఈ సమావేశంలో పాల్గొన్నారు. వారు, కాంగ్రెస్‌లో చేరుడని, కార్మిక సంస్థల నడిగిరి. తుదకు, కార్మికులకు, నేషనల్ కాంగ్రెసునకు సంబంధం, ఎలా ఉండాలో నిర్ణయించ బడింది. ఆ తీర్మానమిది.

1. కాంగ్రెసులో కార్మిక యూనియనులకు ప్రాతినిధ్యముండవలెను. (4 అణాల చందాతో అవసరము లేకుండ)

2. కార్మికు లెక్కువ యున్న నియోజకములలో కార్మిక నాయకులనే అభ్యర్థులుగా నిలుపుటకును, కార్మికులయొక్క కనీసపు ఆర్థిక కోర్కెలకును అంగీకరించుచో జాతీయ కాంగ్రెసు నిలుపు అభ్యర్థులను అన్నిచోట్ల కార్మికులు బలపరుపగలరు.

3. కార్మిక కాంగ్రెసులో సభ్యత గల వివిధ స్థలముల కార్మిక యూనియనులు అచ్చట కాంగ్రెసు కమిటీలతో కలిసి, (1) క్రొత్తరాజ్యాంగము భగ్నమగుటకును (2) యుద్ధములో పాల్గొనరాదను విషయమునను (3) సామ్యవాద ప్రభుత్వ స్థాపనకును, (4) ప్రజల హక్కుల రక్షణ సంఘము నేర్పరచుటకును (5) కార్మికుల స్థితి బాగుపడుటకును, పాటుపడవలెను. ఇట్టి సంబంధము కల్పించుకొను టవసరము.

4. జాతీయ కాంగ్రెసు, కార్మికుల రాజకీయ ఆర్థికపు కోర్కెల కంగీకరించుచో కార్మికులు స్వరాజ్యోద్యమ మందు ఇంకను సంపూర్ణముగా తోడ్పడగలరు.

ఇక ఈ సమావేశము లోని ముఖ్య తీర్మానాలు.

1. కాంగ్రెసు సోషలిస్టు పక్షమును, జవహర్లాలు గారు లక్నో జాతీయ కాంగ్రెసు సమయమున చేసినపనిని అభినందించుట.

2. జాతీయ కాంగ్రెసు కార్మికులతోను, రైతులతోను సంబంధము కల్పించుకొనుట కేర్పరచిన కమిటీల కామోదను సూచించుచు, రైతులును కార్మికులును, జాతీయ కాంగ్రెసును

కలిసి ఏకముఖముగా సామ్రాజ్య తత్త్వమును ప్రతిఘటింప వలెను.

3. ప్రభుత్వము, సుభాష్ బోసుగారిని, కార్మికనాయకు లగు రూయికర్, నింబ్కార్, రాయ్, ముకుందలాల్ సర్కార్ మొదలగువారిని వెంటనే విడుదల చేయవలెను.

4. ప్రభుత్వము,ప్రజల హక్కులు భంగపరుప బడుచున్న విధమును నిరశించుచు, ప్రజల హక్కుల రక్షణసంఘ స్థాపనకు జాతీయ కాంగ్రెసుకు, తోడ్పడుట.

5. క్రొత్త రాజ్యాంగమును నిరసించుచు భారత ప్రజా ప్రతినిధుల అసెంబ్లి నిర్ణయించు రాజ్యాంగమే ఇండియాకు కావలెను.

6. వ్యవసాయ కూలీలపట్ల సానుభూతి ప్రకటించుట.

7. యుద్ధములో పాల్గొనరాదను జాతీయ కాంగ్రెసు తీర్మానము అంగీకరించుట.

ట్రేడ్ యూనియను కాంగ్రెసునకు, ఈ సంవత్సరానికి, శివనాధ బెనర్జీ గారు అధ్యక్షులుగా ఎన్నుకొన బడ్డారు. వారు

జామీను మీద ఉండటం వల్ల ఉపాధ్యక్షులుగా ఎన్నుకొన బడ్డ, ఆర్. బి. ఖెడిగేకర్ గారు తాత్కాలిక అధ్యక్షులయారు.

ఇట్లు 1936వ సంవత్సరపు బొంబాయి సమావేశం సంతస కరమయిన మార్పుతో ముగిసింది.



# (9)

# 1935—36.

## ఉద్యమం - ప్రభుత్వనిర్బంధం.

---

1935-36 లో కార్మికోద్యమం బాగా విజృంభించింది. 1935 లో మొదటి మూడు నెలలలోనే 49 సమ్మెలు జరిగినవి. ఒక్క బొంబాయరాష్ట్రంలోనే 22 సమ్మెలు జరిగినవి. ఒక్క పారిశ్రామిక స్థలాల్లోనేగాక సమ్మెయొక్క శక్తిని, తదితర శాఖవారుగూడ గుర్తించిరి. విద్యార్థులు, జట్కా, బస్సుడ్రైవర్లు సమ్మెలయొక్క బలమును గుర్తించారు. వారి సమ్మెలు కూడా జరిగినవి. 1935 లో క్రిందిసమ్మెలు ముఖ్యమైనవి.

బెంగుళూరు, మినర్వామిల్లులలో గోనెపట్టలు ధరించమన్నందుకు 200 మంది బాలురు జులై (1935) లో సమ్మె చేశారు. బరోడా జగదీశ్ మిల్లులలో టెక్స్టైల్ మిల్లులలో కూలితక్కువ అని సమ్మె చేశారు. జి. ఐ. పి. రైల్వేవాడియా (బాదరు-బొంబాయి)లో 500 మంది కూలి తగ్గించారని సమ్మె చేశారు. బొంబాయి వెస్టరన్ ఇండియా మాచ్ ఫ్యాక్టరీలో 1000 మంది సమ్మె సాగించారు. కాలికట్ సమీపంలో తిరువెన్నాంలో టెక్స్టైల్ మిల్లు పనివాండ్రు నెలదినములకు పైగా సమ్మె చేశారు.

ఇంకా 1935 లో మద్రాస్‌లో కూలి సంరక్షణ సంఘాలు ఏర్పడినయి. ఇవి ఆల్ యిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు ఈ మధ్యనే అనుబంధించారు. దీనిశాఖలు, ఆంధ్ర తమిళ, కేరళ రాష్ట్రములుగలవు. 1935 జనవరిలో మొదటగుంటూరులో కూలిసంరక్షణసంఘం ఏర్పడింది. ఆంధ్ర రాష్ట్రంలో తెనాలి, గుంటూరు, బెజవాడ, ఏలూరు, నెల్లూరు లలో కూలి సంరక్షణసంఘాలు ఏర్పడినయి. ఇవి బూటకపు నాయకులను వెల్లడిచేసి, కార్మికోద్యమమును, వర్గకలహసిద్ధాంతముల మైన నడుపుటకు తీవ్రంగా కృషి చేస్తున్నారు. ఆంధ్రదేశం లో వీరియాజమాన్యమున, మద్రాస్ ముక్కుపొడి పనివారలసమ్మె, ఆంధ్ర పత్రికా ప్రింటింగ్ కార్మికుల సమ్మె, తెనాలి, బెజవాడలలో, ప్రింటింగ్ కార్మికులసమ్మె, గుంటూరులో లాగుడుబండి పనివారలసమ్మెలు జరిగినవి. కొన్నిటియందు సంపూర్ణవిజయం చెందారు. అనేక కార్మికసంఘాలు నెలకొల్పి కార్మికోద్యమానికి సహాయం చేస్తున్నారు. అప్పుడే 6 గురు సభ్యులు ప్రభుత్వ నిర్బంధమునకు గురియై శిక్షింపబడిరి. ఇద్దరు విడుదలచేయబడిరి.

1936 వ సంవత్సరం లో ఈ ఎనిమిది నెలలలోను కార్మికోద్యమం ఏమాత్రం తగ్గలేదు. సమ్మెలు ఈక్రిందివి గమనింపదగ్గవి. ఫిబ్రవరిలో కలకత్తాలో జనపనార యంత్రాలలో పదిరోజులు సమ్మెసాగినది. పోలీసులు రప్పింపబడ్డారు. 144 వ సెక్షన్ ప్రయోగించారు. బొంబాయిలో టెక్స్టైల్ కార్మికులు

రెండుమగ్గాలపద్ధతి ప్రవేశపెట్టటంచేత 1000 మంది సమ్మె చేశారు. కాలికట్‌లో కాఫీఫ్యాక్టరీలలో 350 మంది స్త్రీలు కార్మికులకోర్కె లంగీకరింప నందులకు సమ్మెచేశారు. 1935 డిశంబరులో ప్రారంభమయిన బర్హాన్‌పూర్ టెక్స్టైల్ సమ్మె ముఖ్యమైనది. ఇందు 1600 మంది కార్మికులు పాల్గొన్నారు. ఈ సమ్మెలోపాల్గొన్న 17 గురిపై, కేసు పెట్టబడినది. పికెటింగు చేసినందులకు అరస్టు చేయబడిరి. జనవరిలో కోయంబత్తూరు మిల్లులలో సమ్మెప్రారంభమయి ఫిబ్రవరి 10 వ తేది వరకు సాగినది. చాలావరకు కార్మికులకోర్కెలు అంగీకరింపబడినవి. కలకత్తా వర్కుషాప్‌లోని సమ్మెకు సానుభూతిగా. పాట్నాలోని దీఘాకార్మికులు సానుభూతిగా సమ్మెచేశారు. బెంగాల్ బీహారులలో ఓడకలాసుల సమ్మె రెండుమాసముల పైనజరిగినది. డీఘా, సోనచేర్, బారిసాల్ మున్నగు ప్రదేశాలలో సమ్మెకట్టారు. అనేక కార్మిక సంఘములనుండియు, పరదేశములనుండియు సానుభూతులు వచ్చినవి. లక్నో టెక్స్టైల్ సమ్మె మరింతముఖ్యమైనది. ఈ సమ్మెలో కొంతమంది కార్మిక నాయకులు అరస్టు చేయబడిరి. కాన్పూరులోని కొంతమంది కార్మికులు ఇక్కడకు రప్పింపబడిరి. వారుకూడ సమ్మెచేశారు.

ఇక విద్యార్థులసమ్మెలు గమనింపదగినవి. బొంబాయి, అహమ్మదాబాద్, రంగూనులలో విద్యార్థులసమ్మెలు, సభలు,

ఊరేగింపులు జరిగినవి. నిన్న మొన్నటి వార్తల వలన ఆలీఘుర్ లో విద్యార్థులు సమ్మెలు చేయుచున్నట్లు తెలియుచున్నది.

ఢిల్లీ, కలకత్తా, హైదరాబాదులలో, జట్కా, టాంగా మోటార్ల సమ్మెలు జరిగినవి. చాలావరకు జయము గాంచినవి.

నైజామ్ స్టేట్ రైల్వేవర్కుషాపులో 2000 మందిసమ్మె చేసిరి. 15 రోజులు సమ్మెసాగినది. కార్మికుల ప్రతినిధులు మాట్లాడుటచే రాజీజరిగినది. కొన్ని కార్మికషరతు లంగీకరింప బడినవి. బొంబాయి ఢిల్లీలో చాకళ్లసమ్మెలు జరిగినవి.

క్రిందటి నెలలో పాండుచరిలో జరిగినసమ్మె చాలా ముఖ్యమైనది. మొదట రాయిడక్ మిల్లులలో సమ్మె జయప్రదముగా జరిగినది. కాని మేయరు, గవర్నర్ల ప్రోత్సాహంవల్ల తదితర మిల్లులలో కొందరు సమ్మెచేశారు. వారికి సానుభూతిగ అందరూ సమ్మెచేశారు. ఇట్టి పరిస్థితులలో, గవర్నరు మేయర్లు గారలు మధ్యవర్తిత్వానికి పూనుకోగా కార్మికులు తిరస్కరించారు. సమ్మె తీవ్రరూపందాల్చింది. కార్మికులందరు మిల్లు ఆవరణలోనేయుండిరి. యజమానులు భయంచే లోపలకువెళ్ళి తలుపులు వేసుకొన్నారు. కిటికీల గుండా ఆహారముపుచ్చుకొం దగల్గారు. తర్వాత జులై 30 వ తేదీన పోలీసులు, సిపాయిలు, మిషన్ గనులతో నిమిషమునకు 100 గుండ్ల చొప్పున గంట వరకు మిల్లుకప్పులపైననూ, ఇతరప్రాంతాలను శాంతముగ

నున్న కార్మికులపై కాల్చారు. 150 మంది చచ్చిపోయారని, 400 మంది గాయపడ్డారని తెలుస్తున్నది. ఇట్టి చిత్రవధ జలియన్‌వాలాబాగ్‌లోతప్ప మరెక్కడ జరుగలేదు. ఇట్టి దారుణ కృత్యాల్ని దేశమంతటా గర్హించారు.

ఇలా దేశమంతటా సమ్మెలతో నిండిపోయినది. కార్మికుల తీవ్రత హెచ్చినది.

## కమ్యూనిష్టు వుద్యమం

1934 లో కమ్యూనిస్టుసంఘం అక్రమసంఘం అని రద్దు చేసినా దేశంలో కమ్యూనిస్టువుద్యమం చచ్చినట్లు కనపడదు. గత ఫిబ్రవరిలో దేశములోని అనేకనగరములందు, కమ్యూనిస్టు సాహిత్యమునకై సోదాలు చేయబడినవి. అనేకపుస్తకములు, కరపత్రములు స్వాధీనం చేసుకొన్నది ప్రభుత్వం. మరల 17-8-36 వ తేదీన లక్నో లాహెూర్‌లలో సోదాచేసి కొంత కమ్యూనిష్టు సాహిత్యాన్ని, నలుబదిగ్రంథాలను పట్టుకొన్నారు. దాలిప్‌సింగ్‌గారిని అరస్టుచేశారు.

గతమార్చిలో ఇక్బల్‌సింగ్, సోమనాథలహ్రీ, చింతాసింగ్ అనుకమ్యూనిస్టులను ప్రభుత్వము అరస్టుచేసికేసుపెట్టింది. మొదటి యిద్దరికి రెండేండ్ల కఠినశిక్ష విధించినది. వారివద్దనున్న 5,000 రూపాయిలు ప్రభుత్వం వశపరచుకొన్నది. కలకత్తాలో త్యాబ్ షేక్ అను కమ్యూనిష్టును దాచుచున్నారని శాంతా

ర్కార్, హరీష్ చౌదరి గారలు అరస్టు చేయబడ్డారు. దీనినిబట్టి చూస్తే, కమ్యూనిస్టు ఉద్యమము రహస్యాంగా జరుగుచున్నట్లు తెలియుచున్నది.

## —♦ ప్రభుత్వ నిర్బంధములు ♦—

ఈ ఒకటిన్నర సంవత్సరాలలో అనేకమంది కార్మికనాయకులు శిక్షింపబడ్డారు. మీరట్ కార్మికనాయకులు అనేకమంది కొన్నిరాష్ట్రములనుండి వెళ్ళగొట్టబడ్డారు. మరికొందరు రాష్ట్రములనుండి కదలరాదని ఉత్తరవీయబడినది. మదరాసు రాష్ట్రమున కూలీసంరక్షణ సంఘసభ్యులు ఆర్గురుశిక్షింపబడిరి. సౌమ్యేంద్రనాధటాగోర్, రూయికర్, నింబకర్ గారలు శిక్షకు లోనయిరి. ఇంకనూ, ఈ సంవత్సరపు ట్రేడ్ యూనియన్ ప్రెసిడెంటగు శివనాధ బెనర్జీగారు కలకత్తాలో విచారింపబడు చున్నారు. వీరు మీరట్కుట్రకేసుఖైదీలు. 8 సంవత్సరాలు యూరప్‌లో ఉన్నారు. అమానుల్లా విశ్వవిద్యాలయంలో రెండేండ్లు ప్రొఫెసర్ గావున్నారు. నేటికిని రాయ్, కమ్యూనిస్టును స్టేట్‌ప్రిజనరును 1934 లో మద్రాసునందు అరస్టుచేయబడిన అమీర్ హైదర్ ఖాన్ (శంకర్) గారలు ప్రభుత్వనిర్బంధము లోనే వున్నారు. ఇట్లు కార్మికోద్యమం విజృంభించిన. కొలదీ, ప్రభుత్వనిర్బంధములు అధికమయినవి. అయినను 1935-36 లో కార్మికోద్యమము తీవ్రరూపము తాల్చినదని చెప్పక తప్పదు.

---

# (10)

# తుది వాక్యాలు.

---

అశాంతి ! అశాంతి ! ప్రపంచమంతా, నిరుద్యోగం, ఆకలితో నిండి అశాంతికి నిలయమయింది. ప్రపంచంలో సంపదకు కొదువలేదు. కాని ఎక్కడజూచినా క్షుధార్తులు! నిర్భాగ్యులు! కారణం ? ప్రస్తుతసమాజ వ్యవస్థయే.

◆ ◆ ◆ ◆

ఒకప్రక్క ధనాఢ్యవాదం విచ్చలవిడిగా పెరిగిపోతున్నది. దానితోపాటు కార్మికోద్యమం విజృంభించుచున్నది. కార్మికుల యొత్తిడికి తాళలేక ధనాఢ్యవాదం వివిధరూపాలు తాల్చుచున్నది. అది తన వునికిని నిలబెట్టుకొంటానికి అంతిమ ప్రయత్నాలు చేస్తున్నది. ఆప్రయత్నాల ఫలితమే సామ్రాజ్య వాదము, ఫేసిజము. ధనాఢ్య వాదం యొక్క చివరి అంతస్తే సామ్రాజ్య వాదం. ఇక ఫేసిజం ఆ సామ్రాజ్య వాదం నశించేటప్పుడు తాల్చే నిరంకుశ రూపం. ప్రపంచ కార్మికవర్గం ఈ ధనాఢ్యవాదం నుండి, సామ్రాజ్య వాదంనుండి, ఫేసిజంనుండి తమ హానిసత్వం, దారిద్ర్యం, నిర్మూలించటానికి తీవ్రంగా పోరాడుచున్నది. ఇక భారతదేశం మాత్రం

వెనుకబడుతుందా? లేదు. ఈ ఇరువదేండ్ల చరిత్రయే నిదర్శనం. ప్రపంచ చరిత్రనుండి భారతదేశ చరిత్ర విడదీయటం పొరపాటు.

♦ ♦ ♦ ♦

బ్రిటిష్ సామ్రాజ్యంతోనే గాక, దేశీయ పెట్టుబడిదారులతోకూడ, భారతకార్మికవర్గం, ఎదుర్కొంటున్నది. సత్వర, కార్మికకర్షక రాజ్య స్థాపనానికి ప్రయత్నించు చున్నది. నేడు భారతదేశంలో అనేక రాజకీయ సంస్థలున్నాయి. అందులో సామ్రాజ్య ప్రతికూలంగా వుండేవాటిలో కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు, సోషలిస్టు సంస్థలు ముఖ్యమైనవి, బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వంతో నేషనల్ కాంగ్రెస్ మూడుసార్లు పోరాడి విఫలమైనది. జాతీయోద్యమము పెడదారుల త్రొక్కింది, కాని కార్మిక వర్గాన్ని గురించి నేషనల్ కాంగ్రెస్ ఒక్కసారికూడ తలంచలేదు. అందుకని కాంగ్రెస్‌లోనితీవ్రవాదులు 1934 లో కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ఏర్పరచారు. వీరిలో ఎక్కువమంది మధ్యతరగతికి చెందినవారు. అయినను కార్మికోద్యమంలో సహాయంగా ఉంటున్నారు. మొన్న మొన్న జరిగిన కలకత్తా ఓడ కలాసుల సమ్మెలో ముఖ్యభాగం తీసుకొన్నది కాంగ్రెస్ సోషలిస్టులే. కాని ఒకసంగతిమాత్రం మరువరాదు. వీరు కార్మికవర్గ నాయకత్వం అంగీకరించి అనుసరించితే ఉద్యమం మరింత జయప్రదమౌతుంది. ఇక కాంగ్రెస్‌వారుకూడా నేడు కార్మికోపసంఘమొకటి

నలకొల్పారు. కాని, కాంగ్రెస్‌కు దేశీయ పెట్టుబడిదారుల జమీందారుల నాయకత్వం వదలాలి. కార్మికకర్షకుల కనీసపు హక్కులు అంగీకరించాలి. నేడు కాంగ్రెస్‌సంస్థలో, కార్మికులను వ్యక్తిగతంగా నాల్గణాలచందాయిచ్చి చేరమంటున్నారు. ఈపద్ధతి కార్మికులకు ఏమీ లాభంలేదు. కార్మికసంఘాలకే, నేషనల్ కాంగ్రెస్ ప్రత్యక్షంగా ప్రాతినిధ్యం ఈయాలి. అప్పుడే నిజంగా కార్మికుల క్షేమం కాంగ్రెస్ గమనించినట్లవుతుంది.

♦ ♦ ♦ ♦

స్వాత్మ్యశాసన మనే పిశాచం మనలను ఆవహిస్తున్నది. దానిని సామ్రాజ్యవాద వ్యతిరేకులందరూ కలిసి భగ్నం చేయాలి. ఇందులో కార్మికవర్గం ఎప్పుడూ వెనకబడదని మా తలంపు.

♦ ♦ ♦ ♦

అంతర్జాతీయ శ్రామికవిప్లవానికి ఒకదేశానికొక దేశం సహాయపడాలి. అందుకని

"ప్రపంచ కార్మికులారా ఏకముగండి"

---

# సమ్మెలు.

| పరిశ్రమలు. | 1925 | 1926 | 1927 | 1928 | 1929 | 1930 | 1931 | 1932 | 1933 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| దూది,వులెన్ మిల్లులు | 69 | 57 | 60 | 110 | 78 | 68 | 75 | 54 | 87 |
| జనుపనార మిల్లులు | 15 | 33 | 11 | 19 | 13 | 13 | 22 | 13 | 11 |
| యింజనీరింగ్ వర్కుషాపులు | 7 | 4 | 6 | 11 | 7 | 10 | 5 | 3 | 1 |
| రైల్వేలు, రైల్వే వర్కుషాపులు | 6 | 3 | 3 | 9 | 4 | 9 | 8 | 6 | 3 |
| ఇతరములు | 37 | 31 | 49 | 54 | 39 | 48 | 56 | 42 | 44 |
| మొత్తం. | 134 | 128 | 129 | 203 | 141 | 148 | 166 | 118 | 146 |

(3)

# సమ్మెలు.

## 1882 – 1933.

| సంవత్సరం. | సమ్మెల సంఖ్య. |
|---|---|
| 1882 - 90 | 25 |
| 1890 - 1919 | ... |
| 1920 | 319 |
| 1921 | 376 ♦ |
| 1922 | 372 ♦ |
| 1923 | 209 ♦ |
| 1924 | 132 ♦ |
| 1925 | 134 |
| 1926 | 128 |
| 1927 | 129 |
| 1928 | 203 |
| 1929 | 141 |
| 1930 | 148 |
| 1931 | 166. |
| 1932 | 118 |
| 1933 | 146 |

♦ రాయల్ కమీషన్ లెఖ్ఖల ప్రకారం.

... తెలియదు.

# ఫ్యాక్టరీల అభివృద్ధి.

| సంవత్సరం | ఫ్యాక్టరీలు * | ప్రతి దినం పనిలో ఉండువారి సగటు సంఖ్య. |
|---|---|---|
| 1921 | 3,965† | 1,266,395 |
| 1922 | 5,144 | 1,361,002 |
| 1923 | 5,985 | 1,449,173 |
| 1924 | 6,406 | 1,455,592 |
| 1925 | 6,926 | 1,494,958 |
| 1926 | 7,251 | 1,518,391 |
| 1927 | 7,515 | 1,533,382 |
| 1928 | 7,863 | 1,520,315 |
| 1929 | 8,129 | 1,553,169 |
| 1930 | 8,148 | 1,528,302 |
| 1931 | 8,143 | 1,438,487 |
| 1932 | 8,241 | 1,419,711 |
| 1933 | 8,452 | 1,403,212 |

* ఫ్యాక్టరీ ఆక్టుకు లోబడినవి మాత్రమే.
† ఇందులో బొంగుళూరు, కూర్గు కలపలేదు.

# క్కార్మికులలోని తెగలు.

| సం॥ం | పురుషులు | స్త్రీలు | పిల్లలు ♦ | మొత్తం |
|---|---|---|---|---|
| 1921* | 10,106,86 | 1,875,96 | 68,113 | 1,266,395 |
| 1922 | 1,086,457 | 206,887 | 67,658 | 1,361,002 |
| 1923 | 1,113,508 | 221,045 | 74,620 | 1,409,173 |
| 1924 | 1,147,729 | 235,332 | 72,531 | 1,455,592 |
| 1925 | 1,178,719 | 247,514 | 68,725 | 1,494,958 |
| 1926 | 1,208,628 | 249,669 | 60,094 | 1,518,391 |
| 1927 | 1,222,662 | 253,158 | 57,562 | 1,528,302 |
| 1928 | 1,216,471 | 252,933 | 50,911 | 1,520,315 |
| 1929 | 1,249,165 | 257,161 | 46,843 | 1,533,169 |
| 1930 | 1,225,425 | 254,905 | 37,972 | 1,528,302 |
| 1931 | 1,373,372 | 231,183 | 26,932 | 1,431,487 |
| 1932 | 1,172,296 | 225,632 | 21,783 | 1,419,711 |
| 1933 | 1,167,284 | 216,837 | 19,091 | 1,403,212 |

* 1921 సంవత్సరపు లెక్కలలో, బెంగుళూరు, కూర్గు కలపలేదు.

♦ పిల్లలనగా (1911 సంవత్సరపు 12 వ చట్టము) హిందూదేశ ఫ్యాక్టరీ చట్టప్రకారం 12—15 సంవత్సరముల లోపువారు.

## * 1921 – 30.

### సమ్మెలు.



| సం॥రం | సమ్మె కట్టిన పనివాండ్ర సంఖ్య | సమ్మె వలన పోయిన రోజులు. |
|---|---|---|
| 1921 | 600,000 | 700,000 |
| 1922 | 435,000 | 400,000 |
| 1923 | 301,000 | 510,000 |
| 1924 | 312,000 | 870,000 |
| 1925 | 270,000 | 1,260,000 |
| 1926 | 187,000 | 1,100,000 |
| 1927 | 132,000 | 2,020,000 |
| 1928 | 507,000 | 3,160,000 |
| 1929 | 531,000 | 1,220,000 |
| 1930 | 196,000 | 230,000 |

* రాయల్ కమీషను రిపోర్టునుండి.



## బొంబాయిలోని టెక్స్టైల్ సమ్మెలు.

## 1930 - 34.



| కాలము | సమ్మెలు | సమ్మెదారుల సంఖ్య | సమ్మె చేసిన దినములు |
|---|---|---|---|
| 1930 జనవరి-జూన్ | 7 | 10,454 | 67,925 |
| జులై - డిశంబరు | 20 | 25,953 | 86,715 |
| 1931 జనవరి-జూన్ | 7 | 10,196 | 78,751 |
| జులై - డిశంబరు | 7 | 11,819 | 130,204 |
| 1932 జనవరి-జూన్ | 4 | 1,890 | 22,290 |
| జులై - డిశంబరు | 7 | 4,855 | 145,058 |
| 1933 జనవరి-జూన్ | 15 | 16,145 | 149,778 |
| జులై - డిశంబరు | 20 | 25,895 | 198,775 |
| 1934 జనవరి-జూన్ | 16 | 110,984 | 3,275,077 |
| జులై - డిశంబరు | 10 | 2,608 | 7,321 |

హిందూదేశ కార్మికులు.

## 1922

(నానారాజ్యసమితి కార్మికశాఖకై, హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగారు తెలిపిన లెక్కల ననుసరించి.)

| | |
|---|---|
| ♦ వ్యవసాయ కార్మికులు. | 27,810,130 |
| సముద్రవ్యాపార కార్మికులు. | 141,000 |
| పరిశ్రమలు, గృహపరిశ్రమలు, గనులు, ప్రయాణసౌకర్యములలో గల కార్మికులు. | 20,219,000 |

♦ 77,664,886 మంది భూమిగల వ్యవసాయదారులను ఇందు చేర్చలేదు.



హిందూదేశ కార్మికులు.

## 1931

| | | |
|---|---|---|
| వ్యవసాయ కార్మికులు. | $31\frac{1}{2}$ | మిలియన్లు♦ |
| (భూమిగలవ్యవసాయదారులు) | 27 | ,, |
| మగతా చేయువారు. | 34 | ,, |
| భూస్వాములు. | $3\frac{1}{4}$ | ,, |
| పరిశ్రమలు, గనులు, రైల్వేలు మొదలగు వానిలో పనిచేయు కార్మికులు | 26 | ,, |

♦ మిలియన్ అనగా 10 లక్షలు.

### కార్మికుల సంఖ్య.

| తరగతులు | 1911 | 1919 |
| --- | --- | --- |
| వ్యవసాయం. | 25,879,293 | |
| గృహకృత్యాలు. | 2,718,415 | |
| తోటలు. | 810,407 | |
| గనులు. | 224,082 | |
| ఫ్యాక్టరీలు. | ... ... ... | 1,367,136 |
| రైల్వేలు. | | 711,690 |

### కార్మికుల సంఖ్య.

| సంవత్సరం | బట్టలమిల్లులు | జూట్ మిల్లులు |
| --- | --- | --- |
| 1889 | 47,855 | |
| 1881 | ... | ... 59,222 |
| 1915 | 260,000 | 216,000 |
| 1927 | మొత్తం అన్నిశాఖల లోని కార్మికులు | 1,533,382 |

## ట్రేడ్ యూనియన్ ఆక్టు (1926) ప్రకారం రిజిష్టరయిన యూనియనులు.

| సంవత్సరం. | సంఖ్య. |
|---|---|
| 1929 | 87 |
| 1932 | 131 |
| 1933 | 170 |

## రిజిష్టరయిన ట్రేడ్ యూనియన్ మెంబర్లు.

| సంవత్సరం. | మెంబర్లు. |
|---|---|
| 1927 - 28 | 1,166 |
| 1928 - 29 | 3,842 |
| 1929 - 30 | 3,299 |
| 1930 - 31 | 3,151 |
| 1931 - 32 | 3,454 |
| 1932 - 33 | 5,090 |



## వివిధరాష్ట్రములలో రిజిష్టరయిన యూనియన్ల మెంబర్ల సంఖ్య.

## 1933

| రాష్ట్రములు. | యూనియనుల మొత్తం. | మెంబర్ల మొత్తం. |
|---|---|---|
| అజ్మీర్-మార్వార్ | 2 | 34 |
| బెంగాల్ | 31 | 71,860 |
| బీహార్ & ఒరిస్సా | 4 | 2,397 |
| బొంబాయి | 44 | 64,109 |
| బర్మా | 1 | 115 |
| సి. పి. | 11 | 7,305 |
| ఢిల్లి | 10 | 11,749 |
| మద్రాస్ | 34 | 48,054 |
| పంజాబ్ | 27 | 21,863 |
| యు. పి. | 6 | 9,823 |
| మొత్తం. | 170 | 237,369 |

# బొంబాయి రాష్ట్రమున

# ట్రేడు యూనియను ఉద్యమము.

(రిజిష్టరయినవి, కానివి కలిపి.)

| సంవత్సరం | యూనియన్ల సంఖ్య. | మెంబర్ల సంఖ్య. |
|---|---|---|
| 1922 | 22 | 51,472 |
| 1923 | 19 | 46,037 |
| 1924 | 36 | 52,227 |
| 1925 | 38 | 49,318 |
| 1926 | 56 | 74,875 |
| 1927 | 72 | 87,340 |
| 1928 | 94 | 198,072 |
| 1929 | 99 | 196,748 |
| 1930 | 93 | 128,393 |
| 1931 | 97 | 115,657 |
| 1932 | 100 | 111,526 |
| 1933 | 105 | 113,469 |
| 1934 | 105 | 114,824 |

# 1927

| పరిశ్రమాలయముల పేర్లు | సంఖ్య | కార్మికులు |
|---|---|---|
| 1. నేత పరిశ్రమలు | 517 | 740,323 |
| బట్టల మిల్లులు | 323 | 386,198 |
| నార మిల్లులు | 91 | 334,336 |
| పట్టు మిల్లులు | 14 | 2,266 |
| ఉన్ని మిల్లులు | 14 | 8,155 |
| 2. ఇంజనీరింగ్ (విద్యుచ్ఛక్తి) | 674 | 268,380 |
| నౌకాయంత్రశాల | 11 | 7,296 |
| ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ | 39 | 5,786 |
| జనరల్ ఇంజనీరింగ్ | 252 | 45,156 |
| రైళ్లు, వర్కుషాపులు | 130 | 153,294 |
| నౌకానిర్మాణము ఇంజనీరింగ్ | 19 | 24,275 |
| 3. ఖనిజములు లోహములు | 98 | 61,002 |
| లోహములు, పోతపోయు కార్ఖానాలు | 44 | 2,424 |
| ఇనుము, ఉక్కు, మిల్లులు | 6 | 39,052 |
| పెట్రోలుతయారుచేయు యంత్రములు | 11 | 12,837 |
| 4. ఆహారము, నీరు, పొగాకు. | 2,358 | 177,869 |
| పిండిమిల్లులు | 79 | 6,028 |
| బియ్యపు మిల్లులు | 1,180 | 69,025 |
| పంచదార మిల్లులు | 44 | 14,487 |
| తేయాకు మిల్లులు | 826 | 62,775 |
| పొగాకు మిల్లులు | 13 | 7,494 |

| పరిశ్రమాలయముల పేర్లు | సంఖ్య | కార్మికులు |
|---|---|---|
| 5. రసాయనములు, రంగులు | 464 | 54,817 |
| రంగువేయుట, తెలుపుచేయుట | 34 | 6,158 |
| రసాయనములు | 14 | 2,960 |
| అగ్గిపెట్టెలు | 43 | 15,893 |
| నూనె మిల్లులు | 230 | 13,983 |
| 6. కాకితపు పరిశ్రమలు - ముద్రణాలయములు | 331 | 44,175 |
| కాగితపు మిల్లులు | 7 | 5,061 |
| ముద్రణాలయములు | 318 | 38,342 |
| కాగితములు తయారుచేయు గుంజు | 1 | 515 |
| 7. కర్ర, రాయి, గాజుపరిశ్రమలు | 434 | 66,898 |
| పెంకు, ఇటుక బట్టీలు | 111 | 13,130 |
| కోతమిల్లులు | 202 | 19,039 |
| 8. తోళ్ళు, చర్మముల మిల్లులు | 39 | 6,262 |
| చెప్పులు | 11 | 2,663 |
| తోళ్ళు పదునుచేయు శాలలు | 25 | 3,463 |
| 9. నొక్కుడు యంత్రములు | 2,662 | 219,017 |
| ప్రత్తినొక్కుడు యంత్రములు | 2,536 | 183,381 |
| నారనొక్కుడు యంత్రములు | 120 | 35,463 |
| 10. ఇతరములు | 127 | 41,959 |
| మొత్తం. | 7,704 | 1,680,702 |

# గనుల సంఖ్య.

| సం॥రం | బొగ్గు | కాకిబంగారం | మాంగనీస్ | తగరం | ఇతర ఖనిజములు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1924 | 846 | 513 | 186 | 87 | 172 | 1,804 |
| 1925 | 810 | 571 | 214 | 204 | 212 | 2,011 |
| 1926 | 722 | 601 | 221 | 210 | 143 | 1,897 |
| 1927 | 614 | 630 | 220 | 200 | 298 | 1,992 |
| 1928 | 556 | 674 | 184 | 203 | 331 | 1,948 |
| 1929 | 548 | 498 | 125 | 186 | 375 | 1,732 |
| 1930 | 549 | 508 | 82 | 178 | 352 | 1,669 |
| 1931 | 540 | 342 | 56 | 136 | 343 | 1,417 |
| 1932 | 515 | 315 | 23 | 138 | 290 | 1,281 |
| 1933 | 501 | 377 | 17 | 199 | 330 | 1,424 |

# గనులు—పనివారల సంఖ్య.

| సంవత్సరం | ఆక్టుక్రిందకు వచ్చిన గనుల సంఖ్య | భూమిలోపల | భూమిపైన | మొత్తం |
|---|---|---|---|---|
| 1924 | 1,804 | 167,779 | 90,498 | 258,277 |
| 1925 | 2,011 | 168,554 | 84,303 | 253,857 |
| 1926 | 1,897 | 189,371 | 70,742 | 260,113 |
| 1927 | 1,992 | 196,341 | 72,949 | 269,290 |
| 1928 | 1,948 | 197,398 | 70,273 | 267,671 |
| 1929 | 1,732 | 199,908 | 69,783 | 269,701 |
| 1930 | 1,669 | 191,915 | 69,752 | 261,667 |
| 1931 | 1,417 | 170,638 | 60,144 | 230,782 |
| 1932 | 1,281 | 151,924 | 52,734 | 204,658 |
| 1933 | 1,424 | 153,942 | 52,565 | 206,507 |

# 1. కార్మికుల ఆదాయము.

* నెల 1కి 100కి ఎంతమంది ఎంతెంత జీతములను సంపాదించు చున్నారు.

| రాష్ట్రములు | రు 13లకు లోపుగా | రు 13-0-0—17-8-0 లోపుగా | రు 17-8-0—22-8-0 లోపుగా | రు 22-8-0—27-8-0 లోపుగా | రు 27-8-0—32-8-0 లోపుగా | రు 32-8-0 కు లోగా |
|---|---|---|---|---|---|---|
| సంయుక్త రాష్ట్రములు | 26 | 27 | 15 | 9 | 7 | 16 |
| మదరాసు | 22 | 25 | 19 | 15 | 4 | 15 |
| మధ్య పరగణాలు | 18 | 38 | 17 | 8 | 4 | 15 |
| బీహార్ & ఒరిస్సా | 21 | 24 | 21 | 12 | 8 | 14 |
| బెంగాల్ | 13 | 18 | 18 | 15 | 10 | 26 |
| పంజాబ్ | 10 | 16 | 36 | 10 | 7 | 21 |
| బొంబాయి | 3 | 10 | 19 | 23 | 13 | 32 |
| బర్మా | 1 | 8 | 10 | 16 | 27 | 43 |

* రాయల్ కమీషన్ రిపోర్టునుండి

# 2. కార్మికుల ఆదాయము.

| * కుటుంబాదాయము. | అహమ్మదాబాదు (1926) 100 కి | కుటుంబము 1కి సగటునగలపనివాండ్ర సంఖ్య. | షోలాపూర్ (1925) 100 కి | కుటుంబము 1కి సగటునగలపనివాండ్ర సంఖ్య. |
|---|---|---|---|---|
| రూ. 20— లకు లోపుగా | 2 | 1.2 | 8 | 1.0 |
| రూ. 20—30 లకు లోపుగా | 17 | 1.2 | 23 | 1.6 |
| రూ. 30—40 లకు లోపుగా | 21 | 1.5 | 26 | 1.9 |
| రూ. 40—50 లకు లోపుగా | 25 | 1.6 | 21 | 2.0 |
| రూ. 50—60 లకు లోపుగా | 18 | 1.9 | 11 | 2.4 |
| రూ. 60—70 లకు లోపుగా | 8 | 2.0 | 5 | 3.0 |
| రూ. 70—80 లకు లోపుగా | 5 | 2.4 | 3 | 2.7 |
| రూ. 80—90 లకు లోపుగా | 4 | 2.2 | 3 | 3.3 |

* రాయల్ కమీషన్ రిపోర్టునుండి.

# 3. కార్మికుల ఆదాయము.

సగటున దినమునకు సంపాదన

| కేంద్రము | పురుషులు. | స్త్రీలు. | పిల్లలు. |
|---|---|---|---|
| బొంబాయి. | రు 1- 3-0 | రు 0- 9-9 | ... |
| అహమ్మదాబాద్ | 1- 5-0 | 0-11-9 | రు 0-5-0 |
| షోలాపూర్ | 0-14-5 | 0-5-10 | 0-3-6 |

సగటున నెలకు సంపాదన.

| | బొంబాయి | షోలాపూర్ |
|---|---|---|
| పురుషులు | రు. 30-1-9 | రు. 20-15-0 |
| స్త్రీలు | 14-3-0 | 8-12-0 |
| పిల్లలు | ... | 5- 0-0 |

అస్సాం రాష్ట్రమునకు కూలికై వలసపోయిన కార్మికుల సంఖ్య.

| | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 | 1932-33 |
|---|---|---|---|---|---|
| పురుషులు | 37,161 | 33,510 | 30,245 | 23,247 | 15,412 |
| స్త్రీలు | 16,548 | 14,117 | 13,362 | 14,986 | 12,552 |
| పిల్లలు | 15,191 | 12,169 | 9,912 | 12,764 | 11,937 |
| మొత్తం | 68,900 | 59,796 | 53,519 | 50,997 | 39,901 |

# 1921—1929

| సంవత్సరం | ఫ్యాక్టరీ చట్టమునకు లోబడిన మిల్లుల సంఖ్య | ప్రతిదినము పనిలో నుండువారి మొత్తం | ప్రోగుచేయబడిన అపాయముల సంఖ్య | | | |
|---|---|---|---|---|---|---|
| | | | చచ్చిపోయినవారు | ప్రమాదకరమైనవి | స్వల్పమైనవి | మొత్తం |
| 1929 | 8,129 | 1,553,169 | 240 | 4,389 | 15,579 | 20,208 |
| 1928 | 7,863 | 1,520,315 | 264 | 3,494 | 12,590 | 16,348 |
| 1927 | 7,515 | 1,533,382 | 242 | 3,403 | 12,036 | 15,711 |
| 1926 | 7,251 | 1,518,391 | 270 | 3,155 | 11,441 | 14,866 |
| 1925 | 6,926 | 1,497,158 | 263 | 2,481 | 9,901 | 12,645 |
| ♦1924 | 6,406 | 1,455,592 | 284 | 1,690 | 8,055 | 10,029 |
| 1923 | 5,973 | 1,409,173 | 197 | 1,333 | 5,507 | 7,037 |
| 1922 | 5,026 | 1,361,002 | 191 | 1,207 | 5,562 | 6,960 |
| 1921 | 3,965 | 1,266,395 | 203 | 1,179 | 5,634 | 7,016 |

♦ 1924 వ సంవత్సరమునకు పూర్వపు అంకెలలో బెంగుళూరుకూర్గుల అంకెలు కలుపబడలేదు.

## 1930 వ సంవత్సరము.

| రాష్ట్రములు | రిజిష్టరు చేయబడిన మోటారు బండ్ల సంఖ్య | ప్రతిదినము సరాసరి ప్రయాణీకుల మొత్తం | రిపోర్టు చేయబడిన అపాయముల సంఖ్య: చచ్చిపోయినవారు | ప్రమాదకరమైనవి | స్వల్పమైనవి | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| మద్రాస్ | 1,527 | 142,549 | 19 | 436 | 1,709 | 2,164 |
| బొంబాయి | 1,550 | 370,704 | 42 | 1,256 | 5,156 | 6,454 |
| బెంగాల్ | 1,444 | 563,877 | 57 | 1,265 | 2,860 | 4,182 |
| యు. పి. | 376 | 92,161 | 27 | 246 | 1,592 | 1,865 |
| పంజాబ్ | 526 | 49,549 | 20 | 43 | 1,235 | 1,298 |
| బర్మా | 980 | 98,701 | 24 | 293 | 1,927 | 2,244 |
| బీహార్ & ఒరిస్సా | 282 | 66,315 | 36 | 459 | 1,786 | 2,281 |
| సి. పి. & బీరార్ | 695 | 68,856 | 8 | 37 | 258 | 303 |
| అస్సాము | 620 | 45,820 | 6 | 61 | 112 | 179 |
| పశ్చిమోత్తర పరగణాలు | 29 | 1,251 | ... | ... | ... | ... |
| బెలూచిస్తాన్ | 5 | 1,181 | ... | ... | 26 | 26 |
| ఆజ్మీర్ మార్వార్ | 40 | 14,902 | ... | 13 | 568 | 581 |
| ఢిల్లీ | 48 | 9,811 | 1 | 5 | 64 | 70 |
| కూర్గు బెంగుళూరు | 26 | 2,625 | ... | 1 | 136 | 137 |
| మొత్తం. | 8,145 | 1,528,302 | 240 | 4,115 | 17,429 | 21,704 |

# ప్రభుత్వ శాసనాలు.

## 1. చైల్డ్ లేబర్ లా (మొదటి ఫ్యాక్టరీ ఆక్టు) 1881.

1. బొంబాయి ప్రభుత్వం 1875 లో లేబర్ కమీషను నియమించింది. ఈ కమీషన్ నియమించటానికి ముఖ్యకారణం బ్రిటిష్ పెట్టుబడిదారుల, ఇండియా పెట్టుబడిదారుల స్పర్థ. ఇండియాలో, ఎక్కువకాలం పనిచేయించుకోవటం, తక్కువజీతా లీయడం వలన, తక్కువఖరీదుకే ఇండియా పెట్టుబడిదారుల లాభాలు హెచ్చుతున్నవని బ్రిటిష్ పెట్టుబడిదారులు తలచారు. వారు పత్రికలలో అలజడి చేశారు. ఆ అలజడి ఫలితంగా కమీషన్ నియమింపబడ్డది. ఈ కమీషన్, జూట్ మిల్లులు (బ్రిటిష్ పెట్టుబడిదారులవి) తప్ప తక్కిన మిల్లులన్నీ విచారించి మిల్లులలో (1) ఉదయాస్తమానములు పనిచేయించుట. (2) 6, 7 సంవత్సరములు పిల్లలచే పనిచేయించుట, జరుగుతుందని రిపోర్టుచేశారు. తర్వాత, 4 గంటలదినమూ, పిల్లలచే తక్కువ పనిచేయించుకోవాలనీ, వారానికి ఒకదినం సెలవుండాలనీ, పిల్లల కనిష్టవయోనిర్ణయం గావించాలనీ సూచించారు. ఈ సూచనల ఫలితంగా 1881 ఏప్రియల్ 15 వ తేదీన మొదటి ఇండియన్ ఫ్యాక్టరీఆక్టు గావింపబడింది. దీనినే చైల్డ్ లేబర్ లా అంటారు. ఈ ఆక్టులోని షరతులివి.

(1) 7 సం॥ తక్కువ వయసుగల పిల్లలుపనిచేయరాదు.

(2) 7-12 సం॥ వయసుగల రోజుకు 9 గంటలుమాత్రం చేయాలి.

(3) మధ్యాహ్నం విశ్రాంతి ఈయాలి.

(4) నెలకు నాల్గుదినాలు సెలవులుండాలి.

## 2. వుమన్ లేబర్ లా ( రెండవఫ్యాక్టరీఆక్టు ) 1891.

ప్రభుత్వం, మరల 1882 - 84 లో కార్మికులవిషయమై విచారణల గావించింది. 1890 లో ఒక కమీషన్ కూడ నియమించింది ఈ కమీషన్ సూచనల ననుసరించే 1891 మార్చి 19 వ తేదీన మరొకచట్టము ప్యావయింది. ఇందులో యెక్కువగా స్త్రీల విషయం ఉండడంవల్ల, దీనిని వుమన్ లేబర్ లా అంటారు. ఈ ఆక్టులోని షరతులివి.

(1) 50 మందికి తక్కువ కార్మికులులేని ఫ్యాక్టరీలన్నింటికి ఈ ఆక్టు వర్తింపబడుతుంది.

(1) గ్రిన్నింగ్ మిల్లులలో తప్ప తక్కినవాటి కన్నిటికి రాష్ట్రప్రభుత్వాలు, 20 మంది కార్మికులను తక్కువలేని ప్రతి మిల్లుకు ఈ చట్టం వర్తింప జేయవచ్చు.

(3) పిల్లల కనిష్టవయస్సు 9 సం॥ లుండాలి.

(4) 9 సంవత్సరాలనుండి 14 సంవత్సరాలలోపు వయసుపిల్లలచే, రాత్రులు పనిచేయించరాదు.

(5) పిల్లలు 7 గంటలుమాత్రమే పనిచేయాలి.

(6) ఎవరి చేతనూ, 6 గంటల కంటె ఎక్కువ పని చేయించరాదు.

(7) స్త్రీలు రాత్రిళ్ళు పనిచేయరాదు.

(8) 9 సంవత్సరములపిల్లలు డాక్టర్ల సర్టిఫికెట్ పొందాలి.

[9] పనిచేయుకాలం 11 గంటలు మించకూడదు.

[10] విశ్రాంతితో కలిపి 12 ½ గంటలు పనిచేయించవచ్చు.

## 3 మూడవ ఫ్యాక్టరీ ఆక్టు. 1911.

ప్రభుత్వం 1906 లో టెక్స్టైల్ లేబర్ కమిటీని నియమించింది. దీని సూచనల ననుసరించి 1908 వ సంవత్సరం లో మరొక కమీషన్ నియమించ బడింది. ఈ కమిటీ, కమీషన్లు, ఒక నివేదికను సమర్పించారు. ఆ నివేదికలో, కార్మికులు పై చీలకన్న 7,8 పౌనులు, కార్మికులు తక్కువ తూగుచున్నారని తెలిపారు. దీని ననుసరించి 1911 లో ఫ్యాక్టరీ ఆక్టు సవరింప బడింది. ఈ ఆక్టులోని షరతులివి.

[1] పురుషుడుగాని, స్త్రీ గాని, 12 గంటలకు మించి పనిచేయరాదు.

[2] పిల్లలు ఆరుగంటలే పనిచేయాలి.

[3] $5\frac{1}{2}$-7 గంటల మధ్య విద్యుద్దీపాలు వెలుగరాదు. కాని ఈ ఆక్టును, 1914-18 [యుద్ధసమయం]లో ఉల్లంఘించి పెట్టుబడిదారులు, కార్మికులచే ఇష్టం వచ్చినట్లు పనిచేయించు కొన్నారు.

## 4. నాల్గవఫ్యాక్టరీ ఆక్టు. 1922.

ఇక నాల్గవ ఫ్యాక్టరీ ఆక్టు 1922 లో ప్యాసయింది. 1923 లోను, 1926 లోను సంస్కరించ బడింది. 1923 లోని సవరణ సెలవుదినములకు సంబంధించింది. 1926 లోని సవరణ పరిపాలనా విధానానికి సంబంధించింది. ఈ ఆక్టు లోని షరతులివి.

[1] బాలుర కనిష్టవయస్సు 12 సంవత్సరాలు.

[2] 12-15 సంవత్సరముల వయసుగల పిల్లలు 6 గంటలు మాత్రం పనిచేయాలి.

[3] పెద్దవారు దినమునకు 11 గంటలు చేయవచ్చు.

[4] వారానికి 60 గంటలు పనిచేయాలి.

[5] వారానికి 6 గంటలు విశ్రాంతి, ఒకదినం సెలవు అవసరం.

సంస్కరణల ననుసరించి, ఒకేనాడు, రెండుమూడు ఫ్యాక్టరీలలో పిల్లలచే పనిచేయించిన తలిదండ్రులు దండించ బడతారు.

## 5. కార్మిక నష్టపరిహార శాసనము. 1923.

కార్మికులకు, ఫ్యాక్టరీలలో సాభవించే అపాయాల నష్ట పరిహారం యజమానులచే యిప్పించవలెనని, చాలకాలము నుండి అందోళన జరుగుచున్నా, 1923 నాటికిగాని ఈశాసనం రాలేదు. ఇది 1924 జులై నుండి అమలులోకి వచ్చింది. ఈ చట్టంలోని షరతులు.

[1] ఫ్యాక్టరీలు, గనులు, ఓడలు, ఓడరేవులు, కట్టడములు, టెలిగ్రాం, టెలిఫోన్, భూగర్భమున పనిచేయువారు, నిప్పుతోసంబంధించినవారు, రైల్వేకూలీలు మొదలగువారికి ఇది వర్తిస్తుంది.

[2] 300 పైగా తెచ్చుకొనువారి కీచట్టం వర్తించదు.

[3] ఇంటిపనులు చేయువారు, వ్యవసాయ కూలీలకు ఇది వర్తించదు. ఇది 1933 లో సవరించబడింది.

## 6. ట్రేడ్ యూనియన్ ఆక్టు. 1927.

1921 మార్చి 1 వ తేదీన ట్రేడ్ యూనియన్ రక్షణకు, రిజిస్ట్రేషన్‌కు, శాసనము గావించుటకు ప్రభుత్వం ఒప్పుకొంది. 1924 లో ఒక డ్రాఫ్టుబిల్లును అభిప్రాయార్థం ప్రభుత్వం పంపింది. అది సెలక్టుకమిటీలోను, అసెంబ్లీలోను సవరింప

బడింది. 1926 ఫిబ్రవరి 8 తేదీన ప్యాసయింది. గవర్నర్ జనరల్‌గారు 1926 మార్చి 25 తేదీన తన అనుమతి నిచ్చారు. ఈ ఇండియన్ ట్రేడ్స్ యూనియన్ ఆక్టు 1927 జూన్‌నుండి అమలులోకి వచ్చింది.

## 7. ట్రేడ్ డిస్ప్యూట్ ఆక్టు 1929.

ఇది యజమానులకును, కార్మికులకును, తగవులదీర్చుట కని ప్రభుత్వము చెప్పుచున్నది. దీని షరతులు ఇవి.

[1] రైల్వే, పోస్టల్, టెలిగ్రాఫ్, ట్రాం మొదలైన సర్వజనులకు హితకరమైన పరిశ్రమలలో 15 రోజులు నోటీసు లేకుండ. సమ్మెచేయరాదు.

[2] పై సమ్మెలకు, సానుభూతి సమ్మెలు, ప్రభుత్వాన్ని లొంగదీయుటకు ఉద్దేశింపబడిన సమ్మెలు అక్రమములు. ఇది 1932 లో సవరింపబడినది.

ఇది 1934 మే 7 వ తేదీతో అయిపోయినది. కాని మరల, 1934 ట్రేడ్ డిస్ప్యూట్ [ఎక్స్టెండింగ్] ఆక్టుతో శాశ్వతమొనర్చిరి. ఈ సంవత్సరం దీనికి సంబంధించిన ఒక ఆక్టు అసెంబ్లీలో ప్రతిపాదించుదురని తెలుస్తుంది.

## 8. రాయల్ [విటలే] కమీషన్. 1929.

ప్రభుత్వం, "కార్మికుల స్థితిగతులు, జీత బత్తెములు, యజమానుల కార్మికుల సంబాధం, ఆరోగ్యం మొదలైనవి విచారించుటకును, సూచనలు గావించుటకును" 1929 మే 24వ తేదీన ఒక కమీషన్ నియమించింది. దీనిని రాయల్ కమీషన్ అంటారు. దీనికి రైట్ ఆనరబుల్, మిష్టర్. జె. హెచ్. విటలే. (Whitely) గారు చైర్మన్. 1929 అక్టోబర్ 11 వ తేదీన ఇండియాకు, ఈ కమీషన్ వచ్చింది. పలుప్రాంతముల విచారించి 1930 మార్చి 22 వ తేదీన ఇంగ్లాండుకు ప్రయాణమయింది. 1930 అక్టోబర్ 11 వ తేదీన తిరిగివచ్చి, సిలోన్, బర్మాలో తిరిగి నవంబరులో ఢిల్లీ చేరింది.

1931 జూన్‌లో రాయల్ కమీషన్ రిపోర్టు వెలువడింది. ఈ రిపోర్టు చేసిన సూచనల విషయమై తమ అభిప్రాయం తెలుపమని, కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు ఆజ్ఞాపించింది. రాష్ట్ర ప్రభుత్వములు 1932 జులై 15 తేదీవరకు, కమీషన్ సూచనలపై గావించిన పనియు, కేంద్ర ప్రభుత్వం సెప్టెంబరువరకు గావించినపనియు, ఒక రిపోర్టును 1932 సంవత్సరాంతరాన ప్రభుత్వం ప్రకటించింది. 1934 లో మరియొక రిపోర్టు వెలువడింది. అది 1933 జులై

వరకు రాష్ట్రప్రభుత్వాలు, 1933 అక్టోబరువరకు కేంద్రప్రభుత్వం గావించిన, పనులగురించిన రిపోర్టు. ఈ రిపోర్టులు, రాయల్ కమిషన్ సూచించిన సలహాలు ఎంతవరకు అమలులో బెట్టినది తెలుపును. తర్వాత రాయల్ కమిషను సలహాలను మనసునందుంచుకొని, ప్రభుత్వం మరికొన్ని ఆక్టులకు ప్యాస్ చేసినది.

## 9. 1932 ఆక్టు II.

ఇది 1890 లోని, ఎంప్లాయర్సు అండ్ డిస్ప్యూట్స్ ఆక్టును రద్దు పఱచినది.

## 10. టీ డిస్ట్రిక్టు ఎమిగ్రెంటు లేబర్ ఆక్టు 1932.

మొదట 1901 లో అస్సాం లేబర్ అండ్ ఎమిగ్రేషన్ ఆక్టు ప్యాసయినది. ఇది వలసపోవు తేయాకు కూలీలకు సంబంధించింది. 1908, 15,27 లలో సవరింపబడింది. 1932 లో, ఈ ఆక్టుబదులుగా, పై "టీడిస్ట్రిక్ట్స ఎమిగ్రెంట్ లేబర్ ఆక్టు" ప్యాసయినది. ఇది 1933 నుండి అమలులోనికి వచ్చింది.

## 11. నూతన ఆవేశనశాసనం. 1933.

ఇది 1933 సెప్టెంబరు 16 వ తేదీని అసెంబ్లిలో ప్రవేశపెట్టబడెను. దీని షరతులివి.

[1] యజమానులు, కార్మికులు పనిచేయు కాలపరిమితిని ప్రకటించ వలెను.

[2] పనిచేయుచున్న కార్మికుల హాజరు పట్టీని పెట్ట వలెను.

[3] సెలవులు, పనిమార్పులు, విశ్రాంతినిగురించి ప్రకటించుచుండవలెను.

[4] యజమానులు కార్మికులకు తగిన నీటి సదుపాయములు చేయవలెను.

[5] 250 మందికంటె ఎక్కువగలఫ్యాక్టరీలలో విశ్రాంతిమందిరములు నెలకొల్పవలెను.

[6] సంతానవతులగు స్త్రీల వుపయోగం కొఱకు కొన్నిగదులు ప్రత్యేకింపవలెను. ప్రాథమిక చికిత్సకు వలయు సదుపాయములను ఒనగూర్పవలెను.

## 12. ఫ్యాక్టరీఆక్టు 1934.

1881, 1891, 1911, 1922, 1923, 1926 సంవత్సరములలో ఫ్యాక్టరీఆక్టులు, సవరణలు జరిగినవి. కాని మరల ఎట్టి మార్పును లేదు. రాయల్ కమీషన్ రిపోర్టు వెలువడినతర్వాత ఈ ఫ్యాక్టరీఆక్టు అనేకనూతన సవరణలతో అసెంబ్లిలో వెలువడినది. 1934 లో ప్యాసయింది. 1935 జూన్నుండి అమలులోనికి వచ్చింది.

## 13. పేమెంట్ ఆఫ్ వేజస్ బిల్ 1933-36.

కార్మికులకు కూలి, జీతం, సక్రమంగా సకాలములో ఇచ్చువిషయమై 1933 లో ఒకశాసనం అసెంబ్లీలో ప్రవేశపెట్ట బడింది. ఇది ప్రజాభిప్రాయము కనుగొనుటకై ప్రభుత్వవారు కొంతకాలము నిల్పిరి. తర్వాత కొన్ని సవరణలతో కొత్త బిల్లును 1935 ఫిబ్రవరి 13 వ తేదీన ప్రవేశపెట్టబడింది.

### మోడీబిల్లు—కార్మికులను సంకెళ్లు.

ఇది మరల 1936 ఫిబ్రవరిలో చర్చకు వచ్చినప్పుడు హెచ్. పి. మోడీగారు ఒకసవరణను దెచ్చిరి. అది 9 వ క్లాజునకు సంబంధించినది. ఆసవరణయిది "10 మందికాని, అంతకంటె ఎక్కువమందిగాని, నోటీసులేకుండ సమ్మెచేసినా, కారణములేకుండా సమ్మెచేసినా, 13 రోజులకూలి తగ్గించవలెను."

ఈ అమెండమెంటుకు ప్రభుత్వ సభ్యులు, ధనికులు, సపోర్టు చేశారు. ఈ అమెండమెంటును ఎదిరించిన వారిలో ముఖ్యులు గిరి, జోషి, శ్యామలాల్, రంగాగారలు. కొందరు కాంగ్రెసుసభ్యులు తటస్థంగావుండి, కార్మికులకు ద్రోహం చేశారు. గిరిగారు అమెండమెంటును ఎదుర్కొంటూ "ఈఅమెండమెంటు వల్ల కార్మికులకు లాభంకంటె తీరనినష్టం ఎక్కువగల్గుతున్నది.

దీనివిషయమై ముందుగా కార్మికులకుగాని ట్రేడ్‌యూనియన్‌లకుగాని తెలుపబడలేదు. ఈఅమండమెంటు, ట్రేడ్ డిస్ప్యూట్ ఆక్టులో రావాలిగాని, వేజస్ బిల్‌లో రాకూడదు. కార్మికులకుగల అంతిమహక్కు సమ్మెఒకటే. ఇతరఉపాయాలు లేనప్పుడు ఇదే ఉపాయం. అయినా, సమ్మెల్ని - లాలు, అమండమెంటులు ఆపవు. నిజమయినమందు ట్రేడ్‌యూనియనులను గుర్తించడం. కార్మికులకు ఈ బిల్లు పోయినాసరేగాని, ఈఅమండమెంటును ఒప్పుకోరు."

శ్యామలాల్‌గారు "దీనిని కార్మికనిరోధకపు బిల్లుఅంటే బాగుంటుంది. కార్మికులకు కావలసింది మాడలుగాని మాట గాదు. (Workers want wages not phrases)" అని అన్నారు. రంగాగారు ఎదురించుచూ ఒక గంటసేపు ఉపన్య సించారు. ప్రభుత్వసభ్యులతో వాగ్యుద్ధం చేశారు.

ఇది 65 గురి సపోర్టుతోను 44 గురి అపోజిషన్‌తోను ప్యాసంది. చాలమంది కాంగ్రెస్‌వాదులు తటస్థంగా ఉండిరి. దేశాయి, పంత్, యన్. యన్. సర్కారుగారికి, సవరణ డ్రాఫ్టు చేయటంలోని తప్పులను దిద్దుటలో సహాయపడిరి. దాస్ వెంక టాచలం మొదలైన వాళ్ళందరూ తటస్థంగావుండిరి. షౌకతాలీ సపోర్టుచేశాడు.

ఈ బిల్లుతో, ధనాఢ్యులందరూ ఒకటేనన్న సంగతి తేలిపోయింది. కాంగ్రెస్‌వారి తాటస్థ్యం, దేశమాతటా కార్మికులచేతను, యువజనులచేతను, తీవ్రంగా గర్హింపబడింది.

సెలెక్టుకమిటీలో కొద్దిసవరణతో ఇదిఅంగీకరింపబడినది. "13 దినములకు బదులుగా 8 దినముల జీతము పోగొట్టుకొనవలె"నని మార్చబడినది. ఈ మార్పు కార్మికుల కన్నీళ్ళను తుడుచుటయేగాని వారికి క్రొత్తసంకెళ్ళను గల్గించిన దీ మోడీ బిల్లు. కూలీ పంపకపు బిల్లు 1937 నుండి అమలులోకి వస్తుంది.

---

# BIBLIOGRAPHY.

ఇంగ్లీషు.

1. The Labor Movement in India
   by RajaniKanta Das. M. S. C. Ph. D.
2. Colonial Policy in British Imperialism
   by Ralph Fox.
3. Indian year Books
   Times of India.

హిందీ.

4. భారతీయ మజదూర్ ఆందోళన్ కా ఇతిహాస్.
   హరిహరనాథశాస్త్రిగారు

తెలుగు.

5. భారతదేశ ఆర్థికచరిత్ర.
   ఆత్మకూరి గోవిందాచార్యులుగారు.

— పత్రికలు. —

ఇంగ్లీషు

Leader, Hindu, Indian ex press, Indian Labor Journal, Bombay Chronical,

హిందీ:—మజదూర్, శ్రమికమిత్ర, విశ్వమిత్ర - ఆజ్.

తెలుగు:—కాంగ్రెస్, కృష్ణా, ప్రజాబంధు, ఆంధ్ర, ఆంధ్రప్రజ, కార్మిక, ఐరావతి.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B154 |
| పుస్తకం పేరు | భారతీయ కార్మికోద్యమ చరిత్ర |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 119 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 80, D, 82 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Asw |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | pratyu |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |